ఓమ్.

శ్రీగురుభ్యోనమః

# అథ సప్తశతీ.

అస్య శ్రీమహాకాళీరూపప్రథమచరిత్రస్య - బ్రహ్మఋషిః । - గాయత్రీచ్ఛందః - శ్రీత్ర్మలవరచాముణ్డాత్మక శ్రీమహాకాళీదేవతా - నందజాశక్తిః - రక్తదంతికాబీజం - అగ్నిస్తత్వం - శ్రీత్ర్మలవరచాముణ్డాత్మక మహాకాళీప్రీత్యర్థే జపేవినియోగః ॥ ఓం బ్రహ్మఋషయేనమశ్శిరసి - ఓంగాయత్రీఛందసేనమఃముఖే - ఓం మహాకాళీ దేవతాయైనమః - హృది - ఓం నందజాశక్త్యైనమః - దక్షిణస్తనే - ఓం రక్తదంతికాబీజాయనమః వామస్తనే - ఓం అగ్నితత్వాయనమః హృదిన్యసేత్ ॥ ధ్యానం ॥ ఖడ్గంచక్రగదేషుచాపపరిఘాశూలంభుశుండీం శిరః - శ్శంఖంసందధతీంకరైస్త్రినయనాంసర్వాంగభూషావృతాం - నీలాశ్మద్యుతిమాస్యపాదదశకాంసేవే మహాకాళికాం - యామస్తౌత్స్వపితేహరౌ కమలజోహంతుంమధుంకైటభం ॥

## మూలమ్.

హరిః ఓం... ఓం......... మార్కండేయ ఉవాచ - ఓం...... ॥౧॥ ఓం......... సావర్ణిః సూర్యతనయో యోమనుః కథ్యతేష్టమః - నిశామయతదుత్పత్తిం - విస్తరాద్గదతో మమ ॥ ఓం......... ॥ ౨ ॥ ఓం......... మహామాయానుభావేన - యథామన్వంతరాధిపః - సబభూవమహాభాగః సావర్ణిస్తనయోరవేః । ఓం......... ॥ ౩ ॥

## తాత్పర్యము.

మార్కండేయఋషి పలికెను॥ ౧॥ అష్టమమనువైన సావర్ణియను సూర్యపుత్రుని యొక్క యుత్పత్తి సవిస్తరముగా చెప్పుచున్నాను వినుము॥ ౨॥ పుణ్యాత్ముడైన సావర్ణియను సూర్యపుత్రుడు మహామాయాభగవతీ ప్రసాదమువలన మన్వంతరాధిపతి యెటుల అయెనో వినుము॥ ౩॥ పూర్వకాలము స్వారోచిషమన్వంతరమున చైత్రవంశము






## మూలమ్.

ఓం........స్వారోచిషేఽంతరే పూర్వం - చైత్రవంశసముద్భవః ।
సురథో నామరాజాఽభూ త్సమస్తే క్షితిమండలే ॥ ఓం........॥౪॥
ఓం........తస్యపాలయతః సమ్యక్ ప్రజాః పుత్రానివౌరసాన్ ।
బభూవుః శత్రవో భూపాః కోలావిధ్వంసినస్తథా ॥ ఓం........॥౫॥
ఓం........తస్య తైరభవద్యుద్ధ మతిప్రబలదండినః - న్యూనైరపి స తై
ర్యుద్ధే - కోలావిధ్వంసిభిర్జితః-ఓం........॥౬॥ ఓం........
తతః స్వపురమాయాతో నిజదేశాధిపోఽభవత్ - ఆక్రాంతః స మహాభాగ
స్తైస్తదా ప్రబలారిభిః ఓం........॥౭॥ ఓం........అమాత్యై
ర్బలిభిర్దుష్టైర్దుర్బలస్య దురాత్మభిః - కోశో బలం చాపహృతం
తత్రాపి స్వపురే తతః ఓం........॥౮॥ ఓం........తతో మృగ
యావ్యాజేన హృతస్వామ్యః స భూపతిః - ఏకాకీ హయమారుహ్య జ
గామ గహనం వనమ్ - ఓం........॥౯॥ ఓం........స తత్రా
శ్రమమద్రాక్షీద్ద్విజవర్యస్య మేధసః - ప్రశాంతశ్వాపదాకీర్ణం ముని
శిష్యోపశోభితం - ఓం........॥౧౦॥ ఓం........తస్థౌ కంచిత్స
కాలం చ మునినా తేన సత్కృతః ఇతశ్చేతశ్చ విచరంస్తస్మిన్ముని

## తాత్పర్యము.

నందుద్భవించిన సురథుడనురాజు సమస్తపృథ్వీమండల మేలుచుండె
ను॥ ౪॥ అతడు తన ప్రజలను ప్రీతితో పుత్రులవలె లెస్సగా పాలించు
చుండగా కోలావిధ్వంసులను రాజులు శత్రువులయిరి॥ ౫॥ సురథుడు
విశేషబలముకలవాడయ్యును - కొద్దిబలముగల కోలావిధ్వంసుల (రా
జుల)చే యుద్ధముననోడిపోయినవాడాయెను॥ ౬॥ పిమ్మట ప్రబల
శత్రువులచే ఆవరించబడినవాడైనను స్వపురమునకువచ్చి నిజరాజ్యాధి
పత్యము వహించెను॥ ౭॥ అక్కడ స్వపట్టణములోనున్న దురాత్ము
లయి దుష్టులయి బలవంతులయిన మంత్రులు యీదుర్బలుడైన రాజు
యొక్క సేన ధనము నపహరించిరి॥ ౮॥ హరించుబడిన రాజ్యముగల
వాడయి పిమ్మట యశ్వారూఢుడయి ఒంటరిగా వేటవ్యాజమున దట్ట
మైన యడవికి జనెను॥ ౯॥ వైర రహితమైన పశుపక్షి మృగాదులచే
నిండియున్న టువంటిన్ని మునులయొక్క శిష్యులతో శోభించుచున్న
మేధానామక ద్విజవర్యుని ఆశ్రమము తాను (ఆరాజు) చూచెను॥ ౧౦॥
ఆయాశ్రమమందా మునిచే సత్కరించబడి సురథరాజు యిటుఅటు
సంచరించుచు కొంతకాలము నివసించెను॥ ౧౧॥ ఆరాజు అక్కడ









## మూలమ్.

వరాత్రమే - ఓం........॥ ౧౧॥ ఓం........సోఽచింతయత్త
దాత్ర్త - మమత్వాకృష్టచేతనః - మత్పూర్వైః పాలితంపూర్వం
సోయాహీనం పురంహితత్ - ఓం........॥ ౧౨ ॥ ఓం.........
మద్భృత్యైస్తైరసద్వృత్తైర్ధర్మతః పాల్యతేనవా - నజానేస
ప్రధానోమే శూరహస్తీ సదామదః - ఓం........॥ ౧౩॥
ఓం........మమవైరివశంయాతః కాన్ భోగానుపలప్స్యతే - యే
మమానుగతానిత్యం ప్రసాదధనభోజనైః - ఓం ........॥ ౧౪।
ఓం........అనువృత్తిం ధ్రువంతేఽద్యకుర్వంత్యన్య మహీభృతాం
అసమ్యగ్వ్యయశీలైస్తైః కుర్వద్భిః సతతంవ్యయం - ఓం .....॥౧౫॥
ఓం........సంచితః సోతిదుఃఖేనక్షయంకోశోగమిష్యతి - ఏతచ్చా
న్యచ్చ సతతం - చింతయామాసపార్థివః - ఓం ........ ॥౧౬॥
ఓం........తత్రవిప్రాశ్రమాభ్యాసే వైశ్యమేకం దదర్శసః - స
పృష్టస్తేనకస్త్వంభో హేతుశ్చాగమనేఽత్రకః - ఓం.....॥౧౭॥
ఓం........సశోకఇవకస్మాత్త్వందుర్మనాఇవలక్ష్యసే - ఇత్యా
కర్ణ్య వచస్తస్యభూపతేః ప్రణయోదితం - ఓం ........—॥౧౮॥

## తాత్పర్యము.

మమతచే యీడ్వబడిన మనస్సుగలవాడయి నాపూర్వులు పాలించిన
పట్టణము నాచేత పోగొట్టబడెనని చింతించిన వాడాయెను॥ ౧౨॥
దురాచారులయిన నాభృత్యులచేత ధర్మపరిపాలన చేయబడుచున్నదో
లేదో ప్రసాద ధన భోజనములచేత నన్నుయెల్లప్పుడు ననుసరించి
యుండు మంత్రియు సదా మదముచే యుంటూనుండెడు యేనుగయు
నావైరులవశమయి యేభోగము ననుభవించుచున్నారో తెలియను
॥౧౩॥౧౪॥ యెప్పుడునువ్యర్థముగా ఖర్చుచేయు స్వభావముగల నా
భృత్యులు అన్యరాజునుయిప్పుడునిజముగా సేవించుచూ విపరీత(వ్యర్థ)
ఖర్చును చేయుచున్నారు॥౧౫॥ బహుప్రయాసతో సంపాదించినధనము
ఖర్చగుచున్నదని (సురథ) రాజు యీప్రకారముగా మరికొన్ని విషయ
ములు యెల్లప్పుడు చింతించుచుండెను॥౧౬॥ రాజానాముని ఆశ్రమ స
మీపమున నొకవైశ్యుని చూచి నీవెవరు యిక్కడికివచ్చుటకు కారణమే
మి యెందుచేతదుఃఖయుక్తుడవుగా మనోవ్యాకులతగా కనుబడుచు
న్నావని యడిగెను ॥౧౭॥౧౮॥ యిట్లువినయముగా రాజుచేప్పుచ్చుచె
యబడిన మాటలువిని ఆవైశ్యుడురాజునకు యీప్రకారముగానమ్ర









## మూలమ్.

ఓం.........ప్రత్యువాచ సతంవైశ్యః ప్రశ్రయావనతోనృపమ్ -
ఓం.........॥౧౮॥ ఓం.........వైశ్యఉవాచ - ఓం ...౹౨౦౹
ఓం............సమాధిర్నామవైశ్యోహ ముత్పన్నోధనినాంకులె
ఓం.........౹౨౧౹ ఓం.........పుత్రదారై ర్నిరస్తశ్చధనలోభాద
సాధుభిః - విహీనశ్చ ధనైర్దారైః - పుత్రైరాదాయమేధనమ్-
ఓం.........౹౨౨౹ ఓం.........వనమభ్యాగతో దుఃఖీనిరస్తశ్చా
ప్తబంధుభిః - సోహంనవేద్మిపుత్రాణాం కుశలా కుశలాత్మికాం -
ఓం.........॥౨౩॥ ఓం.........ప్రవృత్తింస్వజనానాంచ దారా
ణాంచాత్రసంస్థితః-కిన్నుతేషాంగృహే క్షేమమ క్షేమంకిన్ను సాంప్రతం
ఓం ......... ౹ ౨౪ ౹ ఓం ......... - కథంతేకింనుసద్వృ
త్తాదుర్వృత్తాః కింనుమేసుతాః-ఓం.........॥ ౨౫॥ ఓం.........
రాజోవాచ - ఓం.........॥ ౨౬॥ ఓం.........యైర్నిరస్తోభ
వాన్ లుబ్ధైఃపుత్రదారాదిభిర్ధనైః - ఓం.........॥ ౨౭॥ ఓం.....
తేషుకిం భవతః స్నేహ మనుబధ్నాతి మానసం - ఓం.........
॥౨౮॥ఓం.........వైశ్యఉవాచ- ఓం.........॥౨౯॥ ఓం.....

## తాత్పర్యము.

తతో న త్తరవుచెప్పెను॥౧౭॥౧౮॥ వైశ్యుడు పలికెను॥౨౦॥ నేనుధన
వంతులకులమున పుట్టినవాడను సమాధియనునామముగలవాడను॥ ౨౧॥
దుర్మార్గులయిన స్వజన స్త్రీపుత్రాదులచే ధనలోభమున నాధనమునీసి
కొంబడి స్త్రీధనరహితుడై వెళ్ళగొట్టబడితిని॥౨౨॥ స్నేహితులచే బంధు
వులచే వెళ్ళగొట్టబడి దుఃఖముతో నీవనమునకు వచ్చితిని. అందుచేత పు
త్రుల క్షేమదుఃఖములను తెలియకనున్నాను॥౨౩॥ యిక్కడవుండి ఇం
టివద్ది స్వజన భార్యా క్షేమ దుఃఖములను ప్రస్తుతము నవిస్తరముగా
తెలియకపోయెను॥ ౨౪॥ మరియు నాపుత్రులు దురాచారులయియు
న్నవారో లేక సద్వృత్తినున్నవారో తెలియదు ॥ ౨౫॥ రాజు పలి
కెను॥ ౨౬॥ ధనాపేక్షచే (నిన్ను) వెళ్లగొట్టిన పుత్రదారాదులయందు
నీమనస్సెందుకై యాపేక్ష చేయుచున్నది॥ ౨౭ ॥ ౨౮ ॥ వైశ్యుడు
పలికెను॥ ౨౯॥ మీరు యేప్రకారము పలికితిరో నామనస్సునను నదే
రీతినియున్నది ॥ ౩౦ ॥ నేనేమిచేయుదును ధనలోభమువల్ల వెళ్లగొట్టిన
పుత్రునియందు ప్రేమత్యజించి మనస్సు కాఠిన్యమును పొందదు॥౩౧॥
నిరసించిన స్వజనమందేమనస్సు చిక్కుకొనుచున్నది- హేమహామతే-




 



## మూలమ్.

ఏవమేతద్యథాప్రాహ భవానస్మద్గతంవచః - ఓం.........॥ ౩౦॥
ఓం.........కింకరోమినబధ్నాతి మమనిష్ఠురతాంమనః - యైఃస
న్త్యజ్యపితృస్నేహం ధనలుబ్ధైర్నిరాకృతః - ఓం.........॥ ౩౧॥
ఓం.........ప్రీతింస్వజనహార్దంచ హార్దితేష్వేవమేమనః - కిమే
తన్నాభిజానామి - జానన్నపిమహామతే - ఓం.........॥ ౩౨॥
ఓం.........యత్ప్రేమ ప్రవణంచిత్తం విగుణేష్వపి బంధుషు -
తేషాంకృతేమేనిః శ్వాసోదౌర్మనస్యంచ జాయతే-ఓం.........॥౩౩॥
ఓం......... కరోమికిం యన్నమన స్తేష్వప్రీతిషునిష్ఠురమ్ -
ఓం.........॥ ౩౪॥ ఓం.........మార్కండేయఉవాచ -
ఓం.........॥ ౩౫॥ ఓం.........తతస్తౌసహితౌవిప్రతం మునిం
సముపస్థితౌ - ఓం.........॥ ౩౬॥ ఓం.........సమాధిర్నామ
వైశ్యోసౌ సచపార్థివసత్తమః - కృత్వాతుతౌ యథా
న్యాయం యథార్హం తేనసంవిదం - ఓం.........॥ ౩౭॥
ఓం.........ఉపవిష్టాకథాః కశ్చిచ్చక్రతుర్వైశ్యపార్థివౌ -
ఓం.........॥౩౮॥ ఓం.........రాజోవాచ - ఓం ... ॥౩౯॥

## తాత్పర్యము.

యిది యెందువలననో తెలిసియు తెలియకనున్నది ॥ ౩౨ ॥ అవగుణు
లయిన బంధువులయందు మనస్సు విరక్తినిజెందక వారియందే
ప్రేమించుచున్నది - నేనేమిచేయగలవాడను మనస్సు కాఠిన్యమును
పొందకయున్నది ॥ ౩౩ ॥ ౩౪ ॥ మార్కండేయఋషి (జైముని
ఋషితో) పలికెను ॥ ౩౫ ॥ పిమ్మట వారిద్దరున్నుకూడుకొని - ఆ
(శ్రమస్థ) ఋషివద్దికివెళ్ళి కూర్చుండిరి ॥౩౬॥ సమాధియనువైశ్యుడును
సురథరాజును-మునికి విధిప్రకారముగా సత్కరించికూర్చుండివీరిద్దరున్ను
ఒకానొక ప్రశంసచేసిరి॥౩౭॥౩౮॥ రాజుపలికెను॥౩౯॥ హేభగవన్ - నే
నొక (సంగతి) యడుగతలంచినాను అదిమాకు మీరు శలవివ్వవలసి
నది॥౪౦॥ చిత్తస్వాధీనములేక - పోయిన - రాజ్యముగలనాకు రా
జ్యాంగములయందు మమతచేత (మనస్సు) దుఃఖమునుపొందుచున్నది॥
౪౧॥ హేమునిసత్తమ - తెలిసియుండియు - అజ్ఞానునివలెనుండుట
యిదియేమియుండును - యీవైశ్యుడును - స్త్రీ - పుత్ర - భృత్యు
లచేనిరాదరణ చేయబడినవాడు ॥౪౨॥ స్వజనులచేతనున్ను - విడువ
బడినవాడయినను - వారియందే మనస్సుయీడ్చుచున్నది - యీప్రకా

 






## మూలమ్.

ఓం.........భగవన్నా ప్రమహం ప్రష్టుమిచ్ఛామ్యేకం వదస్వతత్ - ఓం.........||౧౦|| ఓం.........దుఃఖాయయ న్మేమనసస్స్వచిత్తా యత్తతాం వినా - మమత్వంగతరాజ్యస్య రాజ్యాంగేష్వఖిలేష్వపి - ఓం.........||౧౧|| ఓం......... జానతోపియథాజ్ఞస్యకిమేతన్ముని సత్తమ - అయంచనికృతః పుత్త్రైర్దారై ర్భృత్యైస్తథోజ్ఝితః - ఓం.........||౧౨|| ఓం......... స్వజనేనచ సన్త్యక్తస్తేషుహా ర్దీతథాప్యతి - ఏవమేషతథాహంచ - ద్వావప్యత్యంతదుఃఖితౌ - ఓం.........||౧౩|| ఓం.........దృష్టదోషేపి విషయేమమత్వాకృష్ట మానసౌ - తత్కిమేతన్మహాభాగయన్మోహోజ్ఞానినోరపి - ఓం.........||౧౪|| ఓం.........మమాస్యచభవత్యేషా-వివేకాంధస్యమూఢతా - ఓం.........||౧౫|| ఓం.........ఋషిరువాచ- ఓం.........||౧౬|| ఓం.........జ్ఞానమస్తిసమస్తస్యజంతోర్విషయగోచరే - ఓం.........||౧౭|| ఓం.........విషయశ్చమహాభాగయాంతిచైవం - పృథక్పృథక్ - దివాంధాః ప్రాణినః కేచిద్రాత్రావంధాస్తథాపరే - ఓం.........||౧౮|| ఓం.........కేచిద్దివాత

## తాత్పర్యము.

రముగామేము యిద్దరము నత్యంతదుఃఖముతోనున్నవారము||౧౨|| దోషముకనుబడుచున్న విషయమందుకూడా మమతచేత మనస్సును యీడ్వబడుచున్నారము (గస్కు) హేమహాభాగ - యిదియేమి జ్ఞానులమన్న యీప్రకారము బాధించునా ||౧౪|| నేనున్ను-యితనున్ను-యజ్ఞానముచేత సంధులమగుచున్నారము||౧౫|| ఋషిపలికెను||౧౬|| కనబడుచున్న సమస్తజంతుజాలములకుజ్ఞానముకలదు||౧౭|| హేరాజ - విషయములు భిన్నభిన్నములుగాజ్ఞానమునుపొందుచున్నవి - దినమందంధత్వముగల జంతువులుకొన్ని మరికొన్నిరాత్రియందంధత్వముగలవి (కలవు) ||౧౮|| కొన్నిప్రాణులు దివారాత్రములయందును సమానదృష్టిగలవి కలవు. మనుష్యులు జ్ఞానముగలవారే - సత్యము. అయినను వారికికేవలజ్ఞానములేదు ||౧౯|| అందుచేత పశుపక్షిమృగాదులకే జ్ఞానముగలదో - ఆప్రకారమే మనుష్యులకున్ను ఆదేజ్ఞానముగలదు ||౨౦|| మనుష్యులకును వాటికిని పరస్పరముగా జ్ఞానము తుల్యమేయయినను-చూడుము (హేరాజ) పక్షులు తాము ఆకలిచేపీడించబడియు ప్రథమాకర్షముల తమశిశువులకు ప్రేమచేయిచ్చుచున్నవి - మనుష్యులువాటి










## మూలమ్.

ఖార్శాత్రే ప్రాణినస్తుల్యదృష్టయః - జ్ఞానినో మనుజాః సత్యంకింతు తే
నహి కేవలం - ఓం.........॥ ౪౯ ॥ ఓం.........యతోహి జ్ఞాని
నః సర్వే - పశుపక్షి మృగాదయః - జ్ఞానం చ తన్మనుష్యాణాం -
యత్తేషాం మృగపక్షిణాం - ఓం.........॥ ౫౦॥ ఓం.........
మనుష్యాణాంచ యత్తేషాం - తుల్యమన్యత్తథో భయోః - జ్ఞానేపిసతి
పశ్యైతాన్పతగాన్ శాబచంచుషు-ఓం.........॥ ౫౧॥ఓం.........
కణమోక్షాదృతాన్మోహాత్పీడ్య మానానపి క్షుధా - మానుషామను
జవ్యాఘ్ర సాభిలాషాః సుతాన్ప్రతి - ఓం.........॥ ౫౨ ॥
ఓం.........లోభాత్ప్రత్యుపకారాయ నన్వేతాంకిం నపశ్యసి -
తథాపి మమతావర్తే మోహగర్తే నిపాతితాః-ఓం.........॥ ౫౩॥
ఓం.........మహామాయా ప్రభావేన సంసారస్థితికారిణా-తన్నాత్ర
విస్మయః కార్యో యోగనిద్రా జగత్పతేః - ఓం.........॥ ౫౪ ॥
ఓం.........మహామాయా హరేశ్చైషా తయా సమ్మోహ్యతే జ
గత్ - జ్ఞానినామపి చేతాంసి దేవీ భగవతీ హి సా-ఓం.........॥ ౫౫॥
ఓం.........బలాదాకృష్య మోహాయ - మహామాయా ప్రయచ్ఛతి

## తాత్పర్యము.

కన్నను శ్రేష్ఠులయినను పుత్రవాత్సల్యతచే (యీలాగున నేచేయుచు
న్నారు) ॥ ౫౧ ॥ ౫౨ ॥ పుత్రులవల్ల తమకు ప్రత్యుపకారము లేనిది
చూచుచున్ను మోహమనెడిగుండమున పడిపోవుచున్నారు ॥ ౫౩ ॥
జగదీశ్వరుని యోగనిద్రయయి సంసారస్థితికారణ భూతురాలయిన
మహామాయా ప్రభావమువలన (గలుగుచున్నదిగన్కు) దీనికిహాశ్చర్య
పడవలసినది లేదు ॥౫౪॥ విష్ణుమూర్తియొక్క మహామాయయను భగ
వతీదేవి సకలజగత్తునున్ను జ్ఞానులచిత్తములనున్ను మోహ పెట్టుచు
న్నది ॥౫౫॥ యీజగత్తున చరాచరములను యావత్తును - మహా
మాయ తన ప్రభావము చేత బలాత్కారముగా
మోహ పెట్టుచున్నది. సృష్టించుచున్నది. ॥౫౬॥ ఆమె నే
ప్రసన్నురాయి మనుష్యులకు ముక్తికై వరము నిచ్చుచున్నది ఆమె నే
సనాతనమైనది ఆమె నే పరబ్రహ్మజ్ఞానమునకు హేతురాలు ॥ ౫౭॥
సంసారబంధమునకు హేతురూపమైన సర్వేశ్వరేశ్వరియు నామెయై
యున్నది॥౫౮॥(సురథ)రాజుపలికెను॥ ౫౯॥హే భగవన్ యెవరినిమీరుమ
హామాయయని చెప్పుచున్నారో ఆదేవియెవరు॥౬౦॥హే ద్విజ ఆమెయొ







## మూలమ్.

తయావిసృజ్యతే విశ్వంజగదేతచ్చరాచరం - ఓం.........||౫౬||
ఓం.........సైషాప్రసన్నావరదా - నృణాంభవతి ముక్తయే -
సావిద్యాపరమాముక్తేర్హేతుభూతాసనాతనీ-ఓం......||౫౭||
ఓం.........సంసారబంధహేతుశ్చసైవసర్వేశ్వరేశ్వరీ-ఓం...||౫౮||
ఓం.........రాజోవాచ - ఓం.........||౫౯|| ఓం.........భ
గవన్కాహిసాదేవి - మహామాయేతియాంభవాన్-ఓం......||౬౦||
ఓం.........బ్రవీతికథముత్పన్నా సాకర్మాస్యాశ్చకింద్విజ - య
త్ప్రభావాచసాదేవీ - యత్స్వరూపాయదుద్భవా-ఓం ......||౬౧||
ఓం......... తత్సర్వంశ్రోతుమిచ్ఛామిత్వత్తోబ్రహ్మవిదాంవర -
ఓం.........||౬౨|| ఓం.........ఋషిరువాచ-ఓం......||౬౩||
ఓం.........నిత్యైవసాజగన్మూర్తి స్తయాసర్వమిదంతతమ్ -
ఓం.........||౬౪|| ఓం.........తథాపితత్సముత్పత్తిర్బహుధా
శ్రూయతాంమమ - దేవానాంకార్యసిద్ధ్యర్థమావిర్భవతిసాయదా -
ఓం......... ||౬౫|| ఓం.........ఉత్పన్నేతితదాలోకేసానిత్యా
ప్యభిధీయతే - యోగనిద్రా యదావిష్ణుర్జగత్యేకార్ణవీకృతే

## తాత్పర్యము.

టులనుత్పన్నమైనది ఆమెపనియేమియెటువంటి ప్రభావముగలదేవి ఆమె స్వరూపమెట్టిది యెక్కడనుండి యుద్భవమయినది||౬౧|| హే బ్రహ్మవిదశ్రేష్ఠా అదిసంపూర్ణముగా నీవల్లవినగోరుచున్నాను||౬౨|| ఋషిపలికెను||౬౩|| ఆమెనిత్యురాలు ఆమెనుండి యీజగత్తుయావత్తున్ను (సృష్టించబడినది) ||౬౪|| అయినను ఆమెయొక్క యుత్పత్తిని పలువిధములుగా నావల్ల వినుము. దేవతుల కార్యసిద్ధికొరకుపుట్టుచున్నది||౬౫|| లోకమున నామెపుట్టినను నామె నిత్యురాలు కల్పాంతమున (జల) ప్రళయసమయమందువిస్తీర్ణమైన శేషతల్పమున భగవంతుడైన విష్ణుమూర్తినిద్రించుచుండగా యిద్దరుఘోరరాక్షసులు మధుకైటభ నామములతోవిఖ్యాతిజెందినవారలు||౬౬||౬౭|| విష్ణుదేవునికర్ణమలము నబుట్టి బ్రహ్మదేవునిచంపుటకై యత్నించిరి - బ్రహ్మదేవుడు విష్ణు నాభికమలముననున్నవాడయి||౬౮|| భయంకరమయిన యారాక్షసుల నున్ను - నిద్రించుచున్న విష్ణుమూర్తినిన్ని చూచి నిశ్చలమనస్సుతో యోగనిద్రారూపమైన మహామాయను (విష్ణుమూర్తియొక్క మేలుకొ వకొరకు)స్తుతించెను||౬౯|| విష్ణుమూర్తి నేత్రములే ఆలయముగా చేసు




## మూలమ్.

ఓం..౧......॥౬౬॥ ఓం.........అస్తీర్య శేషమభజత్కల్పాంతేభ
గవాన్ప్రభుః - తదాద్వావ సురౌఘోరౌవిఖ్యాతౌమధుకైటభౌ
ఓం......... ॥౬౭॥ ఓం.........విష్ణుకర్ణమలోద్భూతౌహంతుం
బ్రహ్మాణముద్యతౌ - సనాభికమలేవిష్ణోస్థితో బ్రహ్మాప్రజాపతిః
ఓం.........॥౬౮॥ ఓం.........దృష్ట్వాతావసురౌచోగ్రౌప్రసు
ప్తంచజనార్దనం - తుష్టావయోగనిద్రాంతామేకాగ్రహృదయస్థితః -
ఓం.........॥౬౯॥ ఓం......... విబోధనార్థాయహరేర్హరి
నేత్రకృతాలయాం - విశ్వేశ్వరీంజగద్ధాత్రీంస్థితిసంహారకారిణీం-
ఓం ......... ॥౭౦॥ ఓం ....... ..స్తౌతినిద్రాంభగవతీంవిష్ణో
రతులతేజసః ఓం.........॥౭౧॥ ఓం ......... ***బ్రహ్మో
వాచ - ఓం ......... ।౭౨। ఓం......... త్వంస్వాహాత్వంస్వ
ధాత్వంహివషట్కారఃస్వరాత్మికా- ఓం.........॥౭౩॥ఓం......
సుధాత్వమక్షరేనిత్యేత్రిధామాత్రాత్మికాస్థితా - అర్ధమాత్రా
స్థితానిత్యాయానుచ్చార్యావిశేషతః- ఓం...... ॥౭౪॥ ఓం......
త్వమేవసంధ్యా సావిత్రీ -త్వందేవీ జననీపరా-త్వయైతద్ధార్యతేవిశ్వం

## తాత్పర్యము.

వున్నటువంటిన్ని జగత్తునుధరించినటువంటిన్ని - పాలించుటకు -
సంహరించుటకు హేతువైనటువంటిన్ని - యోగనిద్రయనుసమాన
రహితమైన తేజస్సునుగల విశ్వేశ్వరిని (స్తుతించెనని యన్వయము)
॥౭౦॥౭౧। బ్రహ్మపలికెను।౭౨। యాగాదులయందు మంత్రరూపిణి
వైన స్వాహాదేవివినీవు - శ్రాద్ధాదులయందు స్వధారూపిణివి (నీవు)
యజ్ఞములలో దేవతలయాహ్వానముచేయుటకు మంత్రరూపమైన వష
ట్కారమునీవ - స్వరాత్మికవునీవ - అర్ధమాత్రాత్మికవునీవ ।౭౩।
నీవమృతరూపిణివి - క్షరరహితవు - నిత్యవు - త్రిమాత్రస్వరూపి
ణివి - నిన్నువర్ణించ యెవరికిశక్యమగును।౭౪। సంధ్యాస్వరూపిణివి
నీవ - సావిత్రీరూపిణివీవ - హేదేవి - నీవు పరాజననివి - యీజగ
త్తు నీచేత నేధరించబడుచున్నది నీవల్లనేయీజగత్తు సృష్టించబడుచున్న
ది ॥౭౫॥ సర్వకాలములయందును - యిదినీచేతనే పాలించబడు
చున్నది - నీవుఅంతమునలయమునుచేయుచున్నావు - సృష్టికాలమున
సృష్టిరూపిణివి - పాలనసమయమున స్థితిరూపిణివినీవ ॥౭౬॥ ఆప్రకా
రమే జగల్లయకాలమున లయస్వరూపిణివి - హేజగన్మయి - మహా






### మూలమ్.

త్వయైతత్సృజ్యతేజగత్ - ఓం......... ॥౭౫॥ ఓం.........
త్వయైతత్పాల్యతేదే వి త్వమత్స్యంతేచ సర్వదా-విసృష్టౌసృష్టిరూపా
త్వంస్థితిరూపాచపాలనే - ఓం......... ॥౭౬॥ ఓం.........
తథాసంహృతిరూపాంతే - జగతోస్యజగన్మయె - మహావిద్యా మహా
మాయా - మహామేధామహాస్మృతిః- ఓం.................. ॥
౭౭ ॥ ఓం.........మహామోహాచభవతి మహాదేవీ మహాసురీ-ప్రకృతి
స్త్వంచసర్వస్య గుణత్రయవిభావినీ- ఓం ......... ॥ ౭౮ ॥
ఓం.........కాళరాత్రి మహారాత్రి మోహరాత్రిశ్చదారుణా-
త్వంశ్రీస్త్వమీశ్వరీత్వంహ్రీస్త్వంబుద్ధిర్బోధలక్షణా- ఓం......
॥౭౯॥ ఓం.........లజ్జాపుష్టిస్తథాతుష్టిః త్వంశాంతిః క్షాంతిరేవచ-
ఖడ్గినీశూలినీఘోరా - గదినీచక్రిణీతథా- ఓం ......... ॥ ౮౦ ॥
ఓం.........శంఖినీచాపినీబాణ భుశుండీపరిఘాయుధా- సౌమ్యా
సౌమ్యతరాశేష సౌమ్యేభ్యస్త్వతిసుందరీ- ఓం.......... ॥ ౮౧ ॥
ఓం.........పరాపరాణాంపరమాత్వమేవపరమేశ్వరీ - యచ్చకించి
చిత్క్వచిద్వస్తు సదసద్వాఖిలాత్మకే - ఓం ......... ॥ ౮౨ ॥

### తాత్పర్యము.

విద్యవు - మహామాయవు - మహామేధవు - మహాస్మృతివినీవ ॥౭౭।
మహామోహవు - మహాదేవివి - మహాసురివి - సమస్తమైన వారిప్ర
కృతిరూపిణివినీవ - త్రిగుణాత్మకవునీవ ॥౭౮॥ కాళరాత్రి - మహా
రాత్రి - మోహరాత్రి - దారుణరాత్రులునీవ - నీవులక్ష్మీరూపిణివి-
ఈశ్వరివినీవు - లజ్జారూపిణివినీవు - మంత్రస్వరూపిణివినీవు - బుద్ధి
యుబోధ లక్షణములునీవ ॥౭౯॥ శిగ్ర - పుష్టి - తుష్టి - శాంతి
క్షాంతులునీవ - ఖడ్గము శూలము - భయంకరమైనగదా చక్రములు
ధరించినదానవు ॥౮౦॥ శంఖము - ధనస్సు - బాణ - భుశుండీ-
పరిఘాయుధములు ధరించినదానవు - సుందరవేంగ్యరూపిణివినీవు -
సంపూర్ణ సుందరవస్తువులలో అతిసుందరరూపిణివినీవ ॥౮౧॥ పరాశక్తి
వినీవు - పరాశక్తులలో శ్రేష్టురాలవునీవు- పరమేశ్వరివినీవు - హేఅ
ఖిలాత్మకేసదసత్తులలో కించిన్మాత్రమైనను నఖిలరూపిణివినీవ ॥౮౨॥
అసదసద్వస్తువులకేశక్తిగలదో నాశక్తివి నీవుగన్ను దేనినిస్తుతిచేయ
నగును - దేనిచేతయెవడు జగత్సృష్టి - స్థితి- లయకారణభూతుండో
వాడు నీవగుదువు ॥౮౩॥ అ (విష్ణుమూర్తిన్ని) నిద్రావశుడయ్యెను-







## మూలమ్.

ఓం......... తస్యసర్వస్యయాశక్తిః సాత్వంకింస్తూయసేసదా -
యయాత్వయా జగత్స్రష్టా జగత్పాత్యత్తియోజగత్ -ఓం.........
॥౭౩॥ ఓం......... సోపినిద్రావశంనీతః - కస్త్వాంస్తోతుమిహే
శ్వరః విష్ణుః శరీరగ్రహణమహమీశానఏవచ - ఓం.........॥౭౪॥
ఓం.........కారితాస్తేయతోతస్త్వాం కస్స్తోతుం శక్తిమాన్భవేత్ -
సాత్వమిత్థంప్రభావైస్స్వై-రుదారైర్దేవిసంస్తుతా-ఓం.........౭౫
ఓం.........మోహయైతౌ దురాధర్షా వసురౌమధుకైటభౌ -
ప్రబోధంచ జగత్స్వామీ-నీయతామచ్యుతోలఘు-ఓం.........౭౬॥
ఓం.........బోధశ్చక్రియ తామస్య హంతుమేతౌ మహాసురౌ
ఓం.........* * * * ॥ ౭౭ ॥ ఓం.........ఋషిరువాచ -
ఓం.........॥ ౭౮ ॥ ఓం.........ఏవం స్తుతాతదాదేవీ తామసీ
తత్రవేధసా - ఓం.........॥ ౭౯॥ ఓం.........విష్ణోః ప్రబోధ
నార్థాయ నిహంతుంమధుకైటభౌ - నేత్రాస్య నాసికాబాహు
హృదయేభ్యస్తథోరసః - ఓం.........॥ ౮౦॥ ఓం.........నిర్గ
మ్యదర్శనేతస్థౌ బ్రహ్మణోవ్యక్తజన్మనః - ఉత్తస్థౌచ జగన్నాథస్త

## తాత్పర్యము.

గన్నునీ స్తుతిచేయుటకు యెవరుసమర్థులు - విష్ణుమూర్తియు - నేను-
ఈశ్వరుడును- శరీరధారులము- నిన్ను స్తుతించుటకు యెవరికిశక్తిగలదు
నీయొక్క మహాత్మ్య ప్రభావముచే యీ స్తుతిచేయబడెను ॥౭౪॥౭౫॥
అసాధ్యులయిన యీమధుకైటభరాక్షసులను మోహపెట్టుము-జగత్క
ర్తయైనవిష్ణుమూర్తిని శీఘ్రముగా మేలుకొలుపుము ॥ ౭౬ ॥
యీ రాక్షసులను చంపుటకై పురికొలుపుము ॥ ౭౭ ॥ ఋషిపలి
కెను ॥౭౮॥ యీ ప్రకారము యోగనిద్రామహామాయ బ్రహ్మచేత
స్తుతి చేయబడినదై ॥౭౯॥ విష్ణుమూర్తిని మేలుకొలుపుటకును-మధు
కైటభులను చంపుటకును - నేత్ర - ఆస్య - నాసికా - బాహు
హృదయ - వక్షస్థలములనుండి ॥ ౮౦ ॥ తనపుట్టువుతనకు తెలియని
బ్రహ్మకు దర్శనమిచ్చుటకై బైలువెడలినిలిచెను - ఆమహామాయ
వలన విడువబడినవాడయి విష్ణుమూర్తి మేలుకొనెను ॥౮౧॥ అతివీర్య
పరాక్రమవంతులై - దుష్టులైనమధుకైటభులను - జలప్రళయమునసే
తనశయ్యనుంచిచూచెను ॥ ౮౨ ॥ క్రోధముచే రక్తనేత్రములు గలిగి
బ్రహ్మదేవుని భక్షించుటకై యత్నించెడువారిని (చూచి) లేచిపిమ్మట









## మూలమ్.

యాముక్త్వాజనార్దనః – ఓం.........॥౯౧॥ ఓం.........ఏకార్ణ
వేహిశయనా త్తతః సదదృశేచతౌ – మధుకైటభౌ దురాత్మానౌ వతి
వీర్యపరాక్రమౌ–ఓం.........॥౯౨॥ ఓం.........క్రోధర క్తేక్షణా
వత్తుం – బ్రహ్మాణంజనితోద్యమౌ – సముత్థాయతతస్తాభ్యాంయు
యుధేభగవాన్ హరిః – ఓం.........॥౯౩॥ ఓం.........పంచ
వర్షసహస్రాణి బాహుప్రహరణోవిభుః – తావప్యతిబలోన్మత్తౌ
మహామాయావిమోహితౌ – ఓం.........॥౯౪॥ ఓం.........
ఉక్తవంతౌవరోస్మత్తో వ్రియతా మితికేశవం–ఓం.........॥౯౫॥
ఓం...........శ్రీభగవానువాచ ఓం – ...........॥౯౬॥
ఓం......భవేతామద్యమేతుష్టౌమమవధ్యావుభావపి – ఓం...॥౯౭॥
ఓం......కిమన్యేనవరేణాత్ర ఏతావద్ధివృతంమయా – ఓం...॥౯౮॥
ఓం.........ఋషిరువాచ – ఓం.........॥౯౯॥ ఓం.........
వంచితాభ్యామితితదా – సర్వమాపోమయంజగత్ –ఓం...॥౧౦౦॥
ఓం.........విలోక్యతాభ్యాంగదితోభగవాన్కమలేక్షణః – ఆ
వాంజహినయత్రోర్వీసలిలేనపరిప్లుతా ఓం ...........॥౧౦౧॥

## తాత్పర్యము.

వారిరువురతో విష్ణుమూర్తి యుద్ధముచేసెను ॥౯౩॥ అయిదువేల సం
వత్సరములు విష్ణుమూర్తి బాహుయుద్ధముచేసెను బలముచేత సున్మత్తు
లయిన మధుకైటభులు మహామాయచే మోహింపబడిన వారలయి
॥౯౪॥ మావద్దవరముకోరుమని విష్ణుమూర్తినిగూర్చి పలికిరి ॥౯౫॥
విష్ణుమూర్తి పలికెను ॥౯౬॥ మీరుసంతోషించినవారలయితిరేని –
నాచేమీరువధింపబడుదురుగాక ॥౯౭॥ యింతమాత్రమునాచేకోరబడి
నది – యితరవరముచే నాకుయేమిప్రయోజనము ॥౯౮॥ ఋషిపలికెను
॥౯౯॥ అప్పుడువిష్ణుమూర్తిచేవంచింపబడినవారలయి– జగత్తుసర్వము
న్ను – జలమయమగుటచూచివిష్ణుమూర్తితో జలములేనిచోట మ
మ్మును చంపుమనిపలికిరి ॥౧౦౦-౧౦౧॥ ఋషిపలికెను ॥౧౦౨॥ శంఖ
చక్రగదాధరుడయిన భగవంతునిచేస రేయని పలుకబడి) వారిరువురిశిర
స్సులను – తనతొడయందు – చక్రముచే ఛేదించెను ॥౧౦౩॥ యీప్ర






| మూలమ్. | తాత్పర్యము. |
|---|---|
| ఓం.........ఋషిరువాచ - ఓం....... ॥౧౦౨॥ ఓం......... తత్క్షేత్యుక్త్వా భగవతా శంఖచక్రగదాభృతా - కృత్వా చక్రేణ వైచ్ఛి న్నేజఘనే శిరసీ తయోః - ఓం ......... ॥౧౦౩॥ ఓం......... ఏవమేషా సముత్పన్నా బ్రహ్మణా సంస్తుతా స్వయమ్ - ప్రభావ మస్యా దేవ్యాస్తు భూయశ్శృణు వదామి తే - ఓం ......... ॥౧౦౪॥ ఇతి శ్రీ.........॥ఉవాచ॥ ౧౪ ॥ అర్థాణి ౨౪ - శ్లోకాని-౬౬- ఏవం ౧౦౪ ఆద్యతః॥ | కారము బ్రహ్మచే స్తుతింపబడి- దేవిస్వయముత్పన్నమైనది - దేవియొక్క ప్రభావము - యింకను చెప్పుచున్నాను వినుము॥౧౦౪॥ |

# అథ మధ్యమచరితమ్

ఓం నమశ్చండికాయై ॥ అస్య శ్రీమహాలక్ష్మీ ద్వితీయచరిత్రస్య - విష్ణుఋషిః - ఉష్ణిక్ఛందః - శ్రీమహాలక్ష్మీర్దేవతా - శాకంబరీశక్తిః - దుర్గాబీజం - వాయుస్తత్త్వం - మహాలక్ష్మీప్రీత్యర్థే జపే వినియోగః - ఓం విష్ణ్వృషయే నమః శిరసి - ఓం ఉష్ణిక్ఛందసే నమః ముఖే - ఓం మహాలక్ష్మీ దేవతాయై నమః హృది- ఓం శాకంబరీశక్త్యై నమః దక్షిణస్తనే - ఓం దుర్గాబీజాయ నమః వామస్తనే

శ్లో॥ అక్షస్రక్పరశుం గదేషుకులిశం - పద్మంధనుఃకుండికాం - దం
డంశక్తిమసించచర్మజలజం ఘంటాసురాభాజనం - శూలంపాశ
సుదర్శనంచదధతీం - హస్తైఃప్రవాళప్రభాం - సంసేవేదిభమ
ర్దినీమిహాసదా - లక్ష్మీంసరోజస్థితాం॥

శ్రీమహాలక్ష్మి

శ్లో॥ శ్రియంసమస్తైరధివాసభూతాం - మహానులక్ష్మీంధరణీంధరా
ణాం - అనాదిమాదింపరమార్థరూపాం - త్వాంసర్వయోనిం
శరణంప్రపద్యే॥ సర్వాశ్రయాం సర్వజగన్నివాసాం - శ్రీమన్మ
హాలక్ష్మీమనాదిదేవీం - శక్తిస్వరూపాంచశివస్వరూపాం - త్వాం
సర్వయోనిం శరణంప్రపద్యే ॥



# ద్వితీయోఽధ్యాయః.

ఓం వాయుతత్త్వాత్మనే నమః హృది - న్యసేత్ । అక్షస్రక్పరశూగదేషుకులిశం పద్మంధనుఃకుండికాం - దండంశక్తిమసించచర్మజలజం ఘంటాంసురాభాజనమ్ - శూలంపాశసుదర్శనంచదధతీం - హస్తైఃప్రవాళప్రభాం - సంసేవేసైరిభమర్దినీమిహమహాలక్ష్మీంసరోజస్థితామ్॥ ఓం నమశ్చణ్డికాయై॥

## మూలమ్.

ఓం.........ఋషిరువాచ - ఓం.........॥౧॥ ఓం.........
దేవాసురమభూద్యుద్ధం పూర్ణమబ్దశతంపురా - మహిషేఽసురా
ణామధిపే దేవానాంచపురందరే - ఓం......... ॥౨॥
ఓం......... తత్రాసురైర్మహావీర్యైర్దేవసైన్యంపరాజితం -
జిత్వాచ సకలాన్దేవానిన్ద్రోఽభూన్మహిషాసురః - ఓం......... ॥౩॥
ఓం.........తతఃపరాజితాదేవాః - పద్మయోనింప్రజాపతిం - పుర
స్కృత్యగతాస్తత్ర - యత్రేశగరుడధ్వజౌ - ఓం.........॥ ౪ ॥
ఓం.........యథావృత్తంతయోస్తద్వన్మహిషాసురచేష్టితం - త్రి
దశాఃకథయామాసు ర్దేవాభిభవవిస్తరమ్ ॥ ఓం......... ॥ ౫ ॥
ఓం.........సూర్యేన్ద్రాగ్న్యనిలేన్దూనాం యమస్యవరుణస్యచ -
అన్యేషాంచాధికారాన్సస్వయమేవాధితిష్ఠతి - ఓం......... ॥౬॥

## తాత్పర్యము.

ఋషి పలికెను ॥౧॥ పూర్వము నిండునూరు సంవత్సరములు రాక్ష
సాధిపతియైన మహిషాసురునకును దేవాధిపతియైన యింద్రునకును
యుద్ధముజరిగెను ॥౨॥ ఆయుద్ధమున మహాబలసంపన్నులయినరాక్షసుల
చేత దేవతాసైన్యముగెలువబడెను-మహిషాసురుడుసకలదేవతలనుగెలచి
ఇంద్రత్వము వహించెను॥౩॥ పిమ్మట ఓడిపోయిన దేవతలు పద్మాసం
భూతుడయిన బ్రహ్మదేవునిముందిడుకొని శివమాధవులుండు స్థలము
నకరిగిరి ॥ ౪ ॥ మహిషాసురుని చేష్టలును - అక్కడజరిగిన వృత్తాంత
మును- సవిస్తరముగా దేవతలునుడివిరి (గద్య) ॥ ౫ ॥ సూర్య- ఇంద్ర
అగ్ని- వాయు- చంద్రమా- యమవరుణులయొక్కయు - యితర
యధికారములన్ను - తానే పొందియున్నవాడు ॥ ౬ ॥ దురా
త్ముడయిన మహిషాసురునిచే దేవగణములు యీడ్వబడుచున్న - స్వర్గము






| మూలమ్. | తాత్పర్యము. |
|---|---|
| ఓం.........స్వర్గాన్నిరాకృతాఃసర్వే తేనదేవగణాభువి- విచరం | నుంచి వెళ్లగొట్టబడినవారయి భూమియందు సంచరించుచున్నారు ॥౭॥ |
| తియథామర్త్యా మహిషేణదురాత్మనా - ఓం......... ॥ ౭ ॥ | అమరారియైన మహిషాసురునిచేష్టలు యావత్తును మీతోచెప్పకొం |
| ఓం.........ఏతద్వఃకథితంసర్వమమరారివిచేష్టితం - శరణంవః ప్ర | టిమి - మేము శరణుచొచ్చియున్నాము - గన్కు- వానివధచింతించ |
| పన్నాస్మో వధ స్తస్యవిచింత్యతాం - ఓం......... ॥ ౮ ॥ | తగ్గది ॥ ౮ ॥ యీప్రకారముగా దేవతులవచనములు శివమాధవులు |
| ఓం.........ఇత్థంనిశమ్యదేవానాం వచాంసిమధుసూధనః - చకార | విని బొమలుముడివేసిన ముఖముతో క్రోధులయిరి ॥ ౯ ॥ అప్పుడతి |
| కోపంశంభుశ్చ భృకుటీకుటిలాననౌ - ఓం......... ॥ ౯ ॥ | కోపపూర్ణులయిన-శివ- మాధవ- బ్రహ్మ- ముఖములనుండిమహత్తర |
| ఓం.........తతోతికోపపూర్ణస్య చక్రిణోవదనాత్తతః - నిశ్చక్రా | మైన తేజస్సొకటి ప్రభవించెను॥ ౧౦ ॥ ఇంద్రుడు మొదలయిన యి |
| మమహత్తేజోబ్రహ్మణః శంకరస్యచ - ఓం......... ॥ ౧౦ ॥ | తరదేవతుల శరీరమునుండి దివ్యమైన ఒక తేజస్సువెడలి ఆమహత్తరమై |
| ఓం.........అన్యేషాంచైవదేవానాం శక్రాదీనాంశరీరతః - నిర్గ | న తేజస్సు నందైక్యమయ్యెను ॥ ౧౧ ॥ అతిజ్వాలలచే సర్వదిశలు వ్యా |
| తంసుమహత్తేజ స్తచ్చైక్యంసమగచ్ఛత - ఓం......... ॥ ౧౧ ॥ | పించి పర్వతసమముగావెలిగెడు తేజఃపుంజమును దేవతులుచూచిరి |
| ఓం.........అతీవతేజసఃకూటం జ్వలంతమివ పర్వతం - దదృ | ॥ ౧౨ ॥ సమస్త దేవతాశరీరములనుంచి యుద్భవించిన యా |
| శుస్తే సురాస్తత్రజ్వాలా వ్యాప్త దిగంతరం - ఓం.. ......॥౧౨॥ | తేజస్సు సమానరహితమైనదిగా నుండి త్రిలోకములయందు |
| ఓం.........అతులంతత్రతత్తేజః సర్వదేవశరీరజం - ఏకస్థంత | వ్యాపించిన కాంతితో ఒక స్త్రీరూపమయ్యెను । ౧౩ ॥ |
| దభూన్నారీ - వ్యాప్తలోకత్రయంత్విషా - ఓం.........॥ ౧౩ ॥ | శంభునివల్లబుట్టిన తేజస్సుచే నాస్త్రీయొక్క- ముఖముగలిగెను-యమ |
| ఓం.........యదభూచ్ఛాంభవం తేజ స్తే నాజాయతతన్ముఖం - | తేజస్సుచే కేశములును - విష్ణుతేజస్సుచే బాహువులును - (గలిగెను) |









## మూలమ్.

యామ్యేనచా భవన్కేశా బాహవో విష్ణుతేజసా-ఓం.........॥౧౪।
ఓం.......... సౌమ్యేన స్తనయోర్యుగ్మం మధ్యంచైంద్రేణచా
భవత్ - వారుణేనచజంఘోరూనితంబ స్తేజసాభువః - ఓం...॥౧౫॥
ఓం........బ్రహ్మణ స్తేజసా పాదౌ తదంగుళ్యోర్క-తేజసా -
వసూనాంచ కరాంగుళ్యః కౌబేరేణచనాసికా - ఓం......॥౧౬॥
ఓం..........తస్యాస్తుదంతాః సంభూతాః ప్రాజాప్రత్యేనతేజసా-
నయనత్రితయంజజ్ఞే తథా పావకతేజసా - ఓం.........॥ ౧౭॥
ఓం.........భ్రువౌచసంధ్యయో స్తేజః శ్రవణావనిలస్యచ - అన్యే
షాంచైవ దేవానాం సంభవ స్తేజసాంశివా - ఓం.........॥ ౧౮ ।
ఓం.........తతస్సమ స్తదేవానాం తేజోరాశిసముద్భవామ్- తాం
విలోక్యముదంప్రాపు రమరామాహిషార్దితాః-ఓం.....॥౧౯ ॥
ఓం.........శూలంశూలాద్వినిష్కృష్యదదౌతస్యైపినాకధృత్ -
చక్రంచదత్తవాన్కృష్ణః సముత్పాట్యస్వచక్రతః-ఓం......॥ ౨౦॥
ఓం.........శంఖంచవరుణశ్శక్తిందదౌ తస్యైహుతాశనః- మారు
తోద త్తవాన్ చాపం బాణపూర్ణేతథేషుధీ - ఓం.........॥ ౨౧ ॥

## తాత్పర్యము.

॥౧౪॥ చంద్రునితేజస్సుచే నడుమును - వరుణతేజస్సుచే జానుజంఘ
లును - పృథివితేజస్సుచే పిరుదులును గలిగెను ॥ ౧౫ ॥ బ్రహ్మతేజ
స్సుచే పాదములును సూర్యతేజస్సుచే పాదాంగుళములును - దిక్పా
లకతేజస్సుచే కరాంగుళములును - కుబేరతేజస్సుచే నాసికయును
(గలిగెను) ॥ ౧౬ ॥ ప్రజాపతితేజస్సుచే నాపెదంతములును-పిమ్మట
అగ్నితేజస్సుచే నేత్రములు - పుట్టెను ॥ ౧౭॥ సంధ్యలయొక్క- తేజ
స్సుచే కనుబొమలును - వాయుతేజస్సుచే - చెవులును - యితర
దేవతలయొక్క.. తేజస్సులతో దేవియుత్పన్నమయ్యెను ॥ ౧౮ ॥
పిమ్మట సమస్తదేవతా సముద్భవమైన తేజఃపుంజముచే నుద్భవించిన
(దేవిని) చూచి మహిషాసురునిచే ఓడిపోయిన దేవతలు సంతోషిం
చిరి ॥ ౧౯ ॥ శంభుడు తనత్రిశూలమువల్ల త్రిశూలము పుట్టించి యా
దేవికనిచ్చెను - విష్ణుమూర్తి తనచక్రమువల్ల చక్రముపుట్టించి
యిచ్చెను॥ ౨౦ ॥ వరుణుడు శంఖమునున్ను-అగ్నిశక్తియను యాయు
ధము - వాయువు ధనస్సును- తూణీరద్వయమును యిచ్చెను । ౨౧ ॥
ఇంద్రుడు వజ్రాయుధమునుండి వజ్రాయుధమును - సహస్రాక్షుడు









## మూలమ్.

ఓం.........వజ్రమింద్రః సముత్పాట్య కులిశాదమరాధిపః - దదౌ
తస్యై సహస్రాక్షో ఘంటామైరావతాద్గజాత్ - ఓం.........||౨౨||
ఓం......... కాలదండాద్యమోదండం పాశంచాంబుపతిర్దదౌ -
ప్రజాపతిశ్చాక్షమాలాం దదౌ బ్రహ్మాకమండలుమ్-ఓం.......||౨౩||
ఓం.........సమస్తరోమకూపేషు నిజరశ్మీన్దివాకరః - కాలశ్చదత్త
వాన్ఖడ్గం తస్యాశ్చర్మచనిర్మలం - ఓం.........|| ౨౪ ||
ఓం.........క్షీరోదశ్చామలంహారమజరేచతథాంబరే - చూడా
మణింతథాదివ్యం కుండలేకటకానిచ - ఓం.........|| ౨౫ ||
ఓం.........అర్ధచంద్రంతథాశుభ్రం కేయూరాన్సర్వబాహుషు -
నూపురౌవిమలౌతద్వద్గ్రైవేయకమనుత్తమం - ఓం.........||౨౬||
ఓం.........అంగులీయకరత్నానిసమస్తాస్వంగులీషుచ - విశ్వక
ర్మాదదౌతస్యై పరశుంచాతినిర్మలం - ఓం.........|| ౨౭ ||
ఓం.........అస్త్రాణ్యనేకరూపాణితథాఽభేద్యంచదంశనమ్ - అ
మ్లానపంకజంమాలాంశిరస్యురసిచాపరాం - ఓం.........||౨౮||
ఓం.........అదదజ్జలధిస్తస్యైపంకజంచాతిశోభనం - హిమవా

## తాత్పర్యము.

ఐరావతమునుండి ఘంటయును యిచ్చిరి || ౨౨ || యమధర్మరాజు
కాలదండమునుండి కాలదండమును - వరుణుడు పాశమును - ప్రజాపతి
జపమాలయును బ్రహ్మదేవుడు కమండలువును యిచ్చిరి || ౨౩ ||
సూర్యుడు తన తేజస్సును దేవియొక్క సమస్తరోమకూపములయందు
నిలిపెను కాలుడు ఖడ్గమును - నిర్మలమైన డాలునుయిచ్చిరి || ౨౪ ||
పాలసముద్రుడు ముత్యాలహారమును - దివ్యమైన నూతనవస్త్రయుగ్మ
మును - యిచ్చెను - ఆప్రకారముగానే దివ్యమైన రాగిడి - కమ్మలు
కంకణములు - శుభ్రమైన చంద్రవంక - సర్వబాహువులకు దివ్యమైన
భుజబంధులును - సుందరమైన పాంజేబులు - అనుపమమైన కంఠహార
మును - సమస్తవేళ్లకు రత్నమయమైన వుంగరములును - నిర్మల
మైన గండ్రగొడ్డలియును - విశ్వకర్మయీ దేవికినిచ్చెను ||౨౫||౨౬||౨౭||
అనేకరూపములయిన యస్త్రములును - ఆప్రకారమే - భేదించశక్య
ముగాని కవచమున్ను యెన్నటికినివాడిపోనిపద్మమాలలును శిరస్సున
వక్షమునధరించుటకు అతిశోభాయమానమయిన పద్మమును హస్త
మునధరించుటకు సముద్రుడునా దేవికియిచ్చెను- హిమవంతుడుయొక్క









### మూలమ్.

న్వాహానం సింహంరత్నానివివిధానిచ - ఓం.........॥ ౨౯ ॥
ఓం.........దదావశూన్యంసురయాపానపాత్రం ధనాధిపః - శేష
శ్చసర్వనాగేశోమహామణివిభూషితం - ఓం.........॥ ౩౦ ॥
ఓం......... నాగహారందదౌతస్యైధత్తేయః పృథివీమిమాం -
అన్యైరపిసురైర్దేవి - భూషణైరాయుధైస్తథా-ఓం.........౩౧॥
ఓం......... సమ్మానితానవనాదోచ్చైః సాట్టహాసంముహుర్ముహు
హుః - తస్యానాదేనఘోరేణకృత్స్నమాపూరితంనభః- ఓం......
॥౩౨॥ ఓం.........అమాయతాతిమహతా ప్రతిశబ్దోమహానభూత్
చుక్షుభుః సకలాలోకాస్సముద్రాశ్చచకంపిరే-ఓం.........॥ ౩౩॥
ఓం.........చచాలవసుధాచేలుఃసకలాశ్చమహీధరాః -జయేతిచము
దాదేవాస్తాము చసింహవాహినీం-ఓం.........॥ ౩౪॥ఓం......
తుష్టువుర్మునయశ్చైనాం - భక్తినమ్రాత్మమూర్తయః - దృష్ట్వా
సమస్తం సంక్షుబ్ధం త్రైలోక్య మమరారయః - ఓం.........
॥౩౫॥ ఓం.........సన్నద్ధాఖిలసైన్యాస్తేసముత్తస్థురుదాయుధాః-
ఆఃకిమేతదితిక్రోధాదాభాష్యమహిషాసురః - ఓం.........॥ ౩౬ ॥

### తాత్పర్యము.

టను సింహమును - అన్యోరత్నములనుయిచ్చెను ॥౨౮॥౨౯॥ కుబే
రుడు సురపూరితయైన పానపాత్రనిచ్చెను - తక్కిన సర్వనాగాధి
పతియై యీభూమినిధరించిన శేషుడు మహామణివిభూషితమైన నాగహా
రము నాదేవికియిచ్చెను - యితరదేవతలచేయాపత్తు ఆయుధములతో
భూషణములతో సన్మానించబడినదయి ॥ ౩౦ ॥ ౩౧ ॥ యిట్లుసన్మా
నించబడినదై దేవి పదేపదే అట్టహాసముగా గొప్పధ్వనిని చేసెను -
నాఘోరమైన నాదముచేత ఆకాశమండలము దట్టముగానిండిపోబ
డెను ॥ ౩౨ ॥ అసంభవమైన ఒక ప్రతిధ్వని పుట్టినందున సకలలోక
ములుక్షోభించెను - సప్తసముద్రములు కంపముజెందెను ॥ ౩౩ ॥
భూమియదిరెను - సమస్తపర్వతములుచలించెను - జయ జయ - యని
దేవతలు సింహవాహనయైన దేవినిపొగడిరి ॥ ౩౪॥ మునీశ్వరులు
నమ్రత్వమువహించిదేవిని స్తుతించిరి - త్రిలోకములు సమస్తము
క్షోభించుటను రాక్షసులుచూచి ॥౩౫॥ అఖిలసైన్యమున్ను యెత్తబడిన
యాయుధములుగలిగి సిద్ధమై-ఆహా! యిదియేమని మహిషాసురుడు
క్రోధయుక్తుడయి - పలికి ॥౩౬॥ సమస్తరాక్షసులతో కూడుకొని









### మూలమ్.

ఓం.........అభ్యధావత తం శబ్దమశేషైరసురైర్వృతః - సదదర్శత
తోదేవీం - వ్యాప్తలోకత్రయాంత్విషా - ఓం.........॥ ౩౭ ॥
ఓం.........పాదాక్రాన్త్యానతభువం - కిరీటోల్లిఖితాంబరాం -
క్షోభితాశేషపాతాళాం-ధనుర్జ్యానిస్స్వనేనతాం-ఓం.......॥౩౮॥
ఓం.........దిశోభుజసహస్రేణ సమంతాద్వ్యాప్యసంస్థితాం-తతః
ప్రవవృతేయుద్ధంతయాదేవ్యాసురద్విషాం - ఓం.........॥ ౩౯ ॥
ఓం.........శస్త్రాస్త్రైర్బహుధాముక్తైరాదీపితదిగంతరం - మహి
షాసురసేనానీశ్చిక్షురాఖ్యోమహాసురః - ఓం.........॥ ౪౦ ॥
ఓం.......యుయుధేచామరశ్చాన్యైశ్చతురంగబలాన్వితః -
రథానామయుతైష్షడ్భిరుదగ్రాఖ్యోమహాసురః - ఓం.........॥౪౧॥
ఓం.........అయుధ్యతాయుతానాంచసహస్రేణమహాహనుః - పం
చాశద్భిశ్చనియుతైరసిలోమామహాసురః - ఓం .........॥౪౨॥
ఓం.........అయుతానాంశతైష్షడ్భిర్బాష్కలోయుయుధేరణే -
గజవాజిసహస్రౌఘైరనేకైఃపరివారితః ఓం .........॥ ౪౩॥
ఓం.........వృతోరథానాంకోట్యాచయుద్ధేతస్మిన్నయుధ్యత - బి

### తాత్పర్యము.

ఆ (దేవిచే చేయబడిన) నినదమునుగూర్చి పరుగెత్తి పిమ్మటతనకాం
తిచే లోకత్రయమును వ్యాపించి వెలుగుచున్న దేవిని మహిషాసురుడు
చూచెను ॥౩౭॥ పాదఘట్టనచేత వంగుచున్న భూమిగలదియు - కిరీట
ముచేత యెత్తిపట్టిన ఆకాశమండలము గలదియు - వింటిత్రాటి
స్వనముచే సమస్తపాతాళలోకమును క్షోభింపచేసినదియు ॥౩౮॥
తన సహస్రభుజములచే సమస్తదిక్కులను వ్యాపించిన (దేవిని చూచెను)
పిమ్మట ఆదేవితో రాక్షసులకు యుద్ధముజరిగెను ॥౩౯॥ బహువిధము
లుగా విడువబడిన శస్త్రాస్త్రములతో దిగంతరములు ప్రకాశించెను-
మహిషాసురుని సేనానాయకుడయినచిక్షురాఖ్యుడుయుద్ధముచేసెను ॥౪౦॥
చామరుడను రాక్షసుడు చతురంగబలములతోనున్న ఉదగ్రాఖ్య
రాక్షసుడు ౬౦ వేల రథములతోనున్న - యుద్ధముచేసిరి ॥ ౪౧ ॥
మహాహనువను రాక్షసుడు వెయ్యయుత (రథములతోనున్న) అసిలో
మడను రాక్షసుడు ౫౦ వందలయుత (రథములతో) నున్న - యుద్ధము
చేసిరి ॥౪౨॥ భాష్కలుడను రాక్షసుడు ౬ వందలయుత (రథములతో)
నున్న - అనేక గజాశ్వములతో కూడుకున్న వాడయి - యుద్ధము చేసె








## మూలమ్.

డాలాఖ్యోయుతానాంచపంచాశద్భిరథాయుతైః ఓం...... ||౪౪||
ఓం........యుయుధేసంయుగేతత్రరథానాంపరివారితః - అన్యే
చత్రాయుతశోరథనాగహయైర్వృతాః - ఓం ......... ||౪౫||
ఓం......... యుయుధుస్సంయుగేదేవ్యాసహతత్రమహాసురాః -
కోటికోటిసహస్రైస్తురథానాందంతినాంతథా - ఓం...... || ౪౬||
ఓం......... హయానాంచవృతోయుద్ధేతత్రాభూన్మహిషాసురః -
తోమరైర్భిండిపాలైశ్చ - శక్తిభిర్ముసలైస్తథా-ఓం ......||౪౭||
ఓం......... యుయుధుస్సంయుగేదేవ్యాఖడ్గైః పరశుపట్టిశైః -
కేచిచ్చచిక్షిపుశ్శక్తీః - కేచిత్పాశాంస్తథాపరే-ఓం.........||౪౮||
ఓం......... దేవీంఖడ్గప్రహారైస్తుతేతాంహంతుంప్రచక్రముః -
సాపిదేవీతతస్తానిశస్త్రాణ్యస్త్రాణిచండికా-ఓం ............ ||౪౯||
ఓం,........లీలయైవప్రచిచ్ఛేదనిజశస్త్రాస్త్రవర్షిణీ - అనాయస్తా
ననా దేవీస్తూయమానాసురర్షిభిః - ఓం ............ ||౫౦||
ఓం......... ముమోచాసురదేహేషుశస్త్రాణ్యస్త్రాణిచేశ్వరీ - సోపి
కృద్ధోధుతసటో దేవ్యావాహనకేసరీ - ఓం............ || ౫౧||

## తాత్పర్యము.

ను||౪౩|| బిడాలాఖ్యరాక్షసుడు-కోటిరథములతో అయుద్ధమందుయుద్ధ
ము చేసెను-పిమ్మటతిరిగి ౫ పందలయుతరథములతో(యుద్ధముచేసెను)
||౪౪|| (యితరరాక్షసులు) అనేకాయుతసంఖ్యల రథగజాశ్వావృతు
లయి యుద్ధమున యుద్ధముచేసిరి||౪౫|| యీమహారాక్షసులు కోట్యా
ది రథగజములతో యుద్ధరంగమున దేవితో యుద్ధముచేసిరి ||౪౬||
అటుపిమ్మట - గుఱ్ఱములతో - తోమర భిందివాల - శక్తి - ముస
లములతో కూడుకొన్నవాడయి - యుద్ధరంగమున మహిషాసురుడు
వచ్చినిలిచె||౪౭|| ఖడ్గ - పరశు - పట్టిశములచేతను - కొందరు (రా
క్షసులు) శక్తులను - మరికొందరు - పాశములనున్ను విడిచిరి||౪౮||
ఆరాక్షసులు దేవిని ఖడ్గములచే కొట్టుటకు వెళ్ళిరి- చండికదేవి నాశ
స్త్రాస్త్రములపై తనశస్త్రాస్త్రవర్షముకురిపించి దేవతలు మునులు స్తుతిం
చుచుండ అలసట లేనిముఖముతో నవలీలగా వాటినిఛేదించెను||౪౯||
||౫౦|| దేవిశస్త్రాస్త్రములను రాక్షసులయందు ప్రయోగించెను। దేవి
వాహనమైన సింహమున్ను - కోపముచేసటలెత్తుకొని ||౫౧||
అడవులయం దగ్నిహోత్రునివలె రాక్షససేనయందు సంచరించెను-









## మూలమ్.

ఓం.........చచారాసురసైన్యేషు వనేష్వివహుతాశనః - నిఃశ్వా
సాన్ముముచేయాంశ్చయుధ్యమానారణేంబికా - ఓం.........౫౨॥
ఓం.........తఏవసద్యః సంభూతాగణాః శతసహస్రశః - యుయు
ధుస్తే పరశుభిర్భిండిపాలాసిపట్టిశైః - ఓం......... ॥౫౩॥
ఓం......... నాశయంతోసురగణాన్దేవీ శక్త్యుపబృంహితాః -
అవాదయంతపటహాన్గణాః శంఖాంస్తథాపరే-ఓం.........౫౪॥
ఓం.........మృదంగాంశ్చతథైవాన్యేతస్మిన్ యుద్ధమహోత్సవే-
తతోదేవీత్రిశూలేనగదయాశక్తిబుష్టిభిః - ఓం......... ।౫౫॥
ఓం.........ఖడ్గాదిభిశ్చశతశో నిజఘానమహాసురాన్ - పాతయా
మాసచైవాన్యాన్ ఘంటాస్వనవిమోహితాన్ - ఓం...... ॥౫౬॥
ఓం......... అసురాన్భువిపాశేన బధ్వాచాన్యానకర్షయత్ -
కేచిద్ద్విధాకృతాస్తీక్ష్ణైః ఖడ్గపాతైస్తథాపరే - ఓం.........॥౫౭॥
ఓం......... విపోథితానిపాతేనగదయాభువిశేరతే - వేముశ్చకే
చిద్రుధిరంముసలేనభృశంహతాః - ఓం.. ......॥౫౮॥ ఓం......
కేచిన్నిపతితాభూమౌభిన్నాః, శూలేనవక్షసి - నిరంతరాశ్శరౌఘేణ

## తాత్పర్యము.

దేవియును రణరంగమున యుద్ధముచేయుచు నిశ్వాసములనువిడిచెను౫౨
ఆనిశ్వాసముతే తత్క్షణమున నూర్లకొలది - వేలకొలదిగణములయి -
పరశు - భిందిపాల - కత్తి - పట్టసములచే యుద్ధముచేసిరి ॥౫౩॥
దేవి నిశ్వాసములయందు పుట్టిన గణములు రాక్షస సమూహమును -
నాశముచేయుచు - మరికొందరు (గణములు) శంఖములను పూరించుచు
డప్పులను వాయించిరి ॥౫౪॥ మరికొందరా యుద్ధరంగమున మృదం
గమును (వాయించిరి) - పిమ్మట దేవి - త్రిశూల - గదా - శక్తి -
బుష్టి - ఖడ్గములచే రాక్షసులను - శతధాఖండించెను - మరికొందరి
రాక్షసులను - ఘంటానాదముచే మోహపరచి పడవేసెను ॥౫౫॥౫౬॥
మరికొందరిని పాశముచే బంధించి భూమినీద పడవేసెను - మరికొం
దరు వాడిగల ఖడ్గప్రహారములచే రెండుగా చేయబడిరి ॥౫౭॥ (మరికొం
దరు) గదాప్రహారములచే పృథివీశయనులయిరి - (మరికొందరు)
ముసలముచే లెస్సగా కొట్టబడి రక్తము గ్రక్కిరి ।౫౮॥ కొందరు
త్రిశూలముచే వక్షము ఛేదించబడి భూశయనులయిరి - కొందరు రణరం
గమున యెడతెగని బాణసమూహముచే ఛేదించబడిరి ॥౫౯॥ కొందరు









## మూలమ్.

కృతాః కేచిద్రణాజిరే - ఓం.........||౫౯|| ఓం.........సేనా
నుకారిణః ప్రాణాన్ముముచుస్త్రిదశార్దనాః - కేషాంచిద్బాహవశ్ఛి
న్నాశ్ఛిన్నగ్రీవా స్తథాపరే - ఓం......... ||౬౦|| ఓం.........
శిరాంసి పేతురన్యేషామన్యే మధ్యేవిదారితాః - విచ్ఛిన్నజంఘా స్త్వ
పరే పేతురుర్వ్యాం మహాసురాః - ఓం ............ ||౬౧||
ఓం.........ఏకబాహ్వక్షిచరణాః కేచిద్దేవ్యాద్విధాకృతాః - ఛి
న్నేపిచాన్యేశిరసిపతితాః పునరుత్థితాః - ఓం......... ||౬౨||
ఓం.........కబంధాయుయుధుర్దేవ్యాగృహీతపరమాయుధాః -
ననృతుశ్చాపరేతత్రయుద్ధేతూర్యలయాశ్రితాః-ఓం.........||౬౩||
ఓం.........కబంధాశ్ఛిన్నశిరసః ఖడ్గశక్త్యృష్టిపాణయః - తిష్ఠ
తిష్ఠేతిభాషంతోదేవీ మన్యేమహాసురాః - ఓం.........||౬౪||
ఓం.........పాతితైరథనాగాశ్వైరసురైశ్చవసుంధరా - అగమ్యా
సాభవత్తత్రయత్రాభూత్సమహారణః - ఓం.........||౬౫||
ఓం.........శోణితౌఘామహానద్యస్సద్యస్తత్రవిసుస్రువుః - మధ్యే
చాసురసైన్యస్య వారణాసురవాజినాం - ఓం......... ||౬౬||

## తాత్పర్యము.

రాక్షససేనాధిపతులు (బాణసమూహముచే) ప్రాణములనువిడిచిరి -
కొందరిబాహువులును - మరికొందరి కంఠములును తెగిన వారైరి||౬౦||
కొందరు శిరములుఖండించబడిరి - మరికొందరు నడుములు ఖండించ
బడిరి-మరికొందరురాక్షసులు జంఘలుఛేదించబడి భూమిపైపడిరి||౬౧||
కొందరు దేవిచే రెండుగాచేయబడిన వారలయి - ఏకచెయ్యి - ఏక
కన్ను - ఏకపాదముగలవారలయిరి - మరికొందరు శిరస్సులు ఖండిం
చబడినవారయి పడినను - తిరిగిలేచినవారలయిరి ||౬౨|| మొండె
ములు తృష్టాయుధములు ధరించినవయి దేవితో యుద్ధము చేసిన
వాయెను- మరికొన్ని (మొండెములు) యుద్ధమున లయనాశ్రయించి
నృత్యముచేసెను ||౬౩|| మరికొందరు మహారాక్షసులు శిరస్సుతెగి
మొండెములయ్యెను - ఖడ్గ - శక్తి - ఋష్టిపాణులయి - తిష్ఠ తిష్ఠ
యని దేవినిభాషించిరి ||౬౪|| ఆ రణరంగమున పడిపోయిన రథగ
జాశ్వరాక్షసులచే నిండినదై భూమి నడుచుటకు వీలులేనిదైయా
యెను||౬౫|| రాక్షససైన్య గజాశ్వాదులమధ్యనుండి రక్తముచే మహా
నదులు తత్క్షణము ప్రవహించెను||౬౬|| క్షణకాలమున రాక్షససేనను -




మూలమ్.

ఓం.........తృణేనతన్మహాసైన్యమసురాణాం తథాంబికా - నిన్యే క్షయంయథావహ్నిస్తృణదారుమహాచయం - ఓం......... ॥౬౪॥

ఓం.........సచసింహోమహానాద ముత్సృజన్ధుతకేసరః - శరీరేభ్యోమరారీణామసూనివవిచిన్వతి - ఓం......... ॥ ౬౫ ॥

ఓం.........దేవ్యాగణైశ్చతైస్తత్ర కృతంయుద్ధంతథాసురైః - యథైషాంతుష్టువుర్దేవాః పుష్పవృష్టిముచోదివి- ఓం.........॥౬౬ ॥

ఇతి శ్రీ...ద్వితీయ ఉవాచ ॥౧॥ శ్లోకాః ॥౬౭॥ ఏవం ॥౬౮॥ఏవమాదితః ॥ ౧౭౩

తాత్పర్యము.

తృణకాష్టముల నగ్నియేరీతిని క్షయింపచేసునో యారీతిని నంబికనశింపచేసెను ॥ ౬౪ ॥ రాక్షసుల ప్రాణములకై వెదుకుచున్న దానివలె సింహము సటలెత్తుకుని మహానాద మొకటి విడిచెను ॥౬౫॥ దేవగణములు రాక్షసులతో యుద్ధముచేసిన సమయమున దేవతలు సంతుష్టులయి పుష్పవృష్టిని కురిపించిరి ॥ ౬౬ ॥

—oo❖oo—

ఓం.........ఋషిరువాచ - ఓం.........॥ ౧ ॥ .........

ఓం.........నిహన్యమానంతత్సైన్యమవ లోక్యమహాసురః - సేనానీశ్చిక్షురః కోపాద్యయౌ యోద్ధుమథాంబికామ్- ఓం.........॥౨॥

ఓం.........సదేవీంశరవర్షేణ వవర్షసమరేసురః - యథామేరుగిరేశ్శృంగం తోయవర్షేణతోయదః - ఓం......... ॥ ౩ ॥

ఓం.........తస్యచ్ఛిత్వాతతోదేవీ లీలయైవశరోత్కరాన్ - జఘాన

ఋషిపలికెను। ౧॥ రాక్షససేనానాయకుండయిన చిక్షురాఖ్యుడు హతమైన సేనను చూచి కోపముతో నంబికనుగూర్చి యుద్ధము చేయుటకు వెళ్ళెను ॥ ౨ ॥ మేఘము వర్షముచే మేరుగిరిశృంగమున వర్షించినట్లు యుద్ధమున రాక్షసుడు బాణవర్షమును దేవిపైకురిపించెను ॥౩॥ ఆరాక్షసుని బాణసమూహమును దేవి యవలీలగా ఛేదించి పిమ్మట నశ్వములను వాటిని తోలెడు వానిని బాణములచే సంహరించెను॥౪॥






## మూలమ్.

సతురగాన్సాఖైర్యజ-ంతారం చైవవాజినామ్ - ఓం.........॥ ౪॥
ఓం.........చిచ్ఛేదచ ధనుః సద్యో ధ్వజం చాతి సముచ్ఛ్రితం -
వివ్యాధచైవగాత్రేషు ఛిన్నధన్వానమాశుగైః - ఓం.........॥౫॥
ఓం.........సచ్ఛిన్నధన్వావిరథో హతాశ్వోహతసారథిః - అభ్య
ధావత తాందేవీం - ఖడ్గచర్మధరోసురః - ఓం.........॥ ౬ ॥
ఓం.........సింహమాహత్యఖడ్గేన - తీక్ష్ణధారేణమూర్ధని -
ఆజఘాన భుజేసవ్యే దేవీమప్యతివేగవాన్ - ఓం......... ॥ ౭ ॥
ఓం.........తస్యాఃఖడ్గోభుజంప్రాప్య పఫాలనృపనందన - తతో
జగ్రాహశూలంసకోపాద రుణలోచనః - ఓం......... ॥ ౮ ॥
ఓం.........చిక్షేపచతత స్తత్తుభద్రకాళ్యాం మహాసురః - జాజ్వ
ల్యమానంతేజోభీ రవిబింబమివాంబరాత్ - ఓం.........॥ ౯ ॥
ఓం.........దృష్ట్వాతేదాపతచ్ఛూలం దేవీశూలమముంచత - త
చ్ఛూలంశతధాతేన నీతంసచమహాసురః - ఓం......... ॥ ౧౦ ॥
ఓం.........హతేతస్మిన్మహావీర్యే మహిషస్యచమూపతౌ - ఆజగా
మగజారూఢశ్చామరస్త్రిదశార్దనః - ఓం............... ॥౧౧॥

## తాత్పర్యము.

తత్కాలమునసే ధనస్సును-అత్యంతోన్నతమైన ధ్వజమును ఛేదించె
ను- చాపవిహీనుడైన రాక్షసుని యవయవములయందు బాణములతో
నొప్పించెను. ॥ ౫ ॥ (చిక్షురాఖ్య) రాక్షసుడు చెడినధనస్సు - రథ
ము- గుఱ్ఱములు, - సారథిగలవాడయి - కత్తియు డాలును ధరించి
దేవినిగూర్చి పరుగెత్తెను॥ ౬ ॥ ఖడ్గపు తీక్ష్ణధారచే సింహమస్తకము
నకొట్టినవాడయి యతివేగమునదేవిని యెడమభుజముపైకొట్టెను ॥ ౭॥
హేరాజ - నాఖడ్గము దేవిభుజస్పర్శనుపొంది విరిగిపోయెను - పి
మ్మటనారాక్షసుడు కోపముచే యెఱ్ఱని నేత్రములుగలవాడయి శూల
మును పుచ్చుకొనెను ॥ ౮ ॥ నారాక్షసుడు - ఆకాశమండలమునుంచి
వచ్చెడు సూర్యబింబమువలె కాంతులచే ప్రజ్వలించెడు శూలమును
దేవిపైప్రయోగించెను ॥ ౯ ॥ అవచ్చెడు శూలమును దేవి
చూచి తన త్రిశూలమును విడువగా నారాక్షసశూలము
న్ను రాక్షసుడున్ను - శతవిధములుగా - ఛేదించబడిరి. ॥ ౧౦ ॥
మహావీర్యవంతుడయిన మహిషాసురసేనానాయకుడు సంహరించబడ
గా - చామరాఖ్యరాక్షసుడు - గజారూఢుడయివచ్చెను ౧౧। ఆరా









## మూలమ్.

ఓం ......... సోపిశక్తింముమోచాథదేవ్యాస్తామంబికాదృతం – హుంకారాభిహతాం భూమౌ పాతయామాస నిష్ప్రభామ్ – ఓం.........॥౧౨॥ ఓం.........భగ్నాంశక్తింనిపతితాం దృష్ట్వా క్రోధసమన్వితః–చిక్షేప చామర శ్శూలం బాణై స్తదపి సాచ్ఛినత్ – ఓం......... ॥౧౩॥ ఓం.........తతఃసింహఃసముత్పత్య గజకుంభాంతరేస్థితః – బాహుయుద్ధేన యుయుధే తేనోచ్చై స్త్రిదశారిణా – ఓం.........॥౧౪॥ ఓం .........యుధ్యమానౌతత స్తౌతుతస్మాన్నాగాన్మహీంగతౌ – యుయుధా తేఽతిసంరబ్ధౌ ప్రహారైరతిదారుణైః – ఓం......... ॥౧౫॥ ఓం .........తతోవేగాత్సముత్పత్యనిపత్యచమృగారిణా – కరప్రహారేణశిర శ్చామరస్యపృథక్కృతం – ఓం......... ॥౧౬॥ ఓం ......... ఉదగ్రశ్చరణేదేవ్యాశిలావృక్షాదిభిర్హతః – దన్తముష్టితలైశ్చైవ కరాళశ్చనిపాతితః – .........॥౧౭॥ఓం.........దేవీక్రుద్ధాగదాపాతైశ్చూర్ణయామాసచోద్ధతం – భాష్కలంభిండిపాలేనబాణైస్తామ్రంతథాంధకమ్– ఓం———॥౧౮॥ ఓం——— ఉగ్రాస్యముగ్రవీర్యంచతథైవచ

## తాత్పర్యము.

క్షసుడు శక్తిని దేవిపైవిడువ– అంబికయొక్క– హుంకారమువల్ల కాంతి విహీనమైనదయి త్వరలోభూమిపైపడెను ౧౨। విరిగిపడిపోయిన శక్తిని చూచికోపించినయుక్తుడయి చామరుడు శూలమునువిడువగా దేవి – బాణములచేత దానినిన్ని ఛేదించెను౧౩। పిమ్మట సింహము చామరుని గజకుంభాంతరాళమున కెగిరి కూర్చుండి– (అంతరాళమనమెడ) రాక్షసునితో బాహుయుద్ధముసలిపెను ౧౪। వారిద్దరును బాహుయుద్ధము చేయుచు అగజమునుంచి భూమిపైకి వచ్చినవారయి యతిభయంకరమయిన ప్రహారములచే యుద్ధమునలిపిరి ౧౫। పిమ్మట సింహమతిత్వరగా భూమిపైయెగిరిక్రిమికి చామరాఖ్యరాక్షసుని – శిరస్సు – చేచరుపుచే వేరుగాచేసెను ౧౬। ఉదగ్రాఖ్యరాక్షసుడు యుద్ధమున దేవిచే శిలావృక్షాదులతో హతము జేయబడెను – కరాళాఖ్యరాక్షసుడు వానిసైన్యమును (చకారముసైన్యపరము)ముష్టిపాతములచేదంతక్షతములచే పడవేయబడెను ౧౭। ఉద్ధతాఖ్య రాక్షసునిన్ని వానిసేననున్ను (చకారముసేనాపరము)–దేవిక్రుద్ధురాలయిగదాపాతములచే చూర్ణము చేసెను – బాష్కలాఖ్యరాక్షసుని భిండిపాలము చేతనున్న– తామ్రా









## మూలమ్.

మహాహనుం- త్రినేత్రా చ త్రిశూలేనజఘానపరమేశ్వరీ-౭.౦ ...॥౧౯॥
౭.౦.........బిడాలస్యాసినా కాయాత్పాతయామాసవై శిరః -
దుర్ధరందుర్ముఖంచోభౌశరై ర్నిన్యేయమక్షయం-౭.౦......॥౨౦॥
౭.౦.........ఏవంసంక్షీయమాణేతుస్వసైన్యేమహిషాసురః - మా
హిషేణస్వరూపేణ త్రాసయామాసతాన్ గణాన్ -౭.౦ .....॥౨౧॥
౭.౦......... కాంశ్చిత్తుండప్రహారేణ ఖురక్షేపై స్తథాపరాన్ -
లాంగూలతాడితాంశ్చాన్యాన్ శృంగాభ్యాంచవిదారితాన్ ౭.౦......
॥౨౨॥ ౭.౦.........వేగేనకాంశ్చిదపరాన్నాదేనభ్రమణేనచ- నిశ్వా
సపవనేనాన్యా న్పాతయామా సభూతలే - ౭.౦.........॥ ౨౩ ॥
౭.౦.........నిపాత్యప్రమథానీకమభ్యధావతసోఽసురః - సింహం
హంతుంమహాదేవ్యాః కోపంచక్రేతతోఽంబికా-౭.౦.........॥ ౨౪ ॥
౭.౦.........సోఽపికోపాన్మహావీర్యః ఖురక్షుణ్ణమహీతలః - శృం
గాభ్యాంపర్వతానుచ్చాం శ్చిక్షేపచననాదచ - ౭.౦.........॥౨౫॥
౭.౦.........వేగభ్రమణవిక్షుణ్ణా మహీతస్యవ్యశీర్యత - లాం
గూలేనాహతశ్చాబ్ధిః ప్లావయామాససర్వతః-౭.౦.........। ౨౬ ।

## తాత్పర్యము

ఖ్య - అంధకాఖ్య - రాక్షసులను బాణములచే (చూర్ణముచేసెను)
।౧౮। ఆప్రకారమే - ఉగ్రాస్యుని - ఉగ్రవీర్యుని - మహాహనువు
ను త్రినేత్రిణియైన పరమేశ్వరి త్రిశూలముచే చంపెను ॥౧౯।
బిడాలాఖ్యరాక్షసుని ఖడ్గముచేతనున్ను - దుర్ధరాఖ్య- దుర్ముఖాఖ్య-
రాక్షసులను - బాణములచేతను యక్షయమైన యమలోకమున కని
పెను ।౨౦। తనసైన్య మీప్రకారముగా నశించినందున మహిషా
సురుడు మహిషరూపముతో గణములను భయపెట్టెను ॥ ౨౧ ।
కొన్ని (గణములను) ముట్టెపోటుపుల చేతను - మరికొన్ని గణములను
గిట్టెత్రొక్కులచేతను - మరికొన్నిగణములను తోకదెబ్బలచేతను -
కొమ్ములుచేతనున్ను - నశింపచేసెను ।౨౨। కొందరిని పరుగువేగము
చేతనున్ను - మరికొందరిని నాదముచేతనున్ను - మరికొందరి ని నిశ్వాస
ములచేతనున్ను - భూమిపై పడవేసెను । ౨౩ । ఆమహిషాసురుడు
ప్రమథగణములను పడవేశి మహాదేవియొక్క సింహమును - చంపు
టకు - పరుగిడినప్పు డంబిక క్రోధపడెను । ౨౪ । మహావీర్యవంతు
డయిన మహిషాసురుడు కోపమువల్ల గిట్టెలచేత భూమిని త్రవ్వేను -




| మూలమ్. | తాత్పర్యము. |
| --- | --- |
| ఓం.........శృంగవిభిన్నాశ్చ ఖండంఖండంయయుర్ఘనాః - | కొమ్ములచేత గొప్పపర్వతములను పడవేసెను - నాదముచేసెను ।౨౬। |
| శ్వాసానిలాస్తాశ్శతశో నిపేతుర్నభసోచలాః - ఓం.........।౨౬। | మహిషాసురుని వడిగలపరువుచేత భూమిపగిలెను-సముద్రములుతోకతో |
| ఓం.........ఇతిక్రోధసమాధ్మాతమాపతంతం . మహాసురం - | కొట్టబడి సర్వత్రతేలుచుండెను ।౨౭। యెత్తబడిన కొమ్ములచే |
| దృష్ట్వాసాచండికాకోపం తద్వధాయతదాకరోత్ ఓం......।౨౭। | మేఘములు తునకలుగా చేయబడెను - వానిశ్వాసవాయువులచే |
| ఓం.........సాక్షిప్త్వాతస్యవైపాశం తంబబంధ మహాసురం - | ఆకాశమునుండి పర్వతములు నూర్లకొలదికూలెను ।౨౬। యీప్రకా |
| తత్యాజమాహిషంరూపం సోఽపిబద్ధోమహామృధే-ఓం......।౨౮। | రము క్రోధముచే నరచుచువచ్చుచున్నమహాసురునిచూచి ఆచండికాదేవి |
| ఓం.........తతస్సింహోఽభవత్సద్యో యావత్తస్యాంబికాశిరః - | అప్పుడువానిని చంపుటకు కోపముచేసెను ।౨౭। ఆమె |
| ఛినత్తితావత్పురుషః ఖడ్గపాణిరదృశ్యత - ఓం.........॥ ౩౦॥ | తనపాశమునువేశి యామహాసురుని కట్టివేసెను - వాడుయుద్ధమున |
| ఓం.........తతఏవాశుపురుషం దేవీచిచ్ఛేదసాయకైః - తంఖ | కట్టబడినవాడయ్యెను - మహిషరూపమును విడిచినవాడయి ।౨౮। |
| డ్గచర్మణాసార్ధం తతఃసోఽభూన్మహాగజః ఓం......... ॥౩౧॥ | పిమ్మటవెంటనే సింహరూపమును ధరియించెను - అంబిక సింహాశిర |
| ఓం.........కరేణచమహాసింహం తంచకర్ష-జగర్జ-చ - కర్ష | స్సును ఖండించినవెంటనే పురుషరూపమున ఖడ్గపాణియైకనబడెను |
| తస్తుకరందేవీ ఖడ్గేన నిరకృంతత - ఓం......... ॥ ౩౨ ॥ | ।౩౦। అతక్షణమున దేవిబాణములచే డాలుకత్తితోనున్న పురుషుని |
| ఓం.........తతోమహాసురోభూయో మాహిషంవపురాస్థితః - | ఖండించెను - పిమ్మటవాడు ఒకగొప్పయేనుగరూపము ధరించెను।౩౧ |
| తథైవక్షోభయామాసత్రైలోక్యంసచరాచరం- ఓం.........॥౩౩॥ | తనతుండముచే సింహమును యీడ్చుచుగర్జించెను - యిట్లీడ్చుచున్న |
| ఓం.........తతఃక్రుద్ధాజగన్మాతా చండికాపానముత్తమం - | తుండమును దేవి ఖడ్గముచేత తెగవేసెను ।౩౨। తిరిగి మహిషాసురు |








# తృతీయోధ్యాయః.

## మూలమ్.

పపౌ పునఃపునశ్చైవ జహాసాఽరుణలోచనా - ఓం.........॥ ౩౪॥
ఓం.........ననర్ద చాసురస్సోఽపి బలవీర్యమదోద్ధతః - విషా
ణాభ్యాంచచిక్షేప చణ్డికాం ప్రతిభూధరాన్ - ఓం.........॥౩౫॥
ఓం.........సాచతాన్ప్రహితాంస్తేనచూర్ణయంతీశరోత్కరైః -
ఉవాచతం మదోద్ధూతముఖరాగాకులాక్షరం - ఓం.........॥౩౬॥
ఓం.........దేవ్యువాచ - ఓం.........॥ ౩౭ । ఓం.........
గర్జగర్జక్షణంమూఢమధుయావత్పిబామ్యహం-మయాత్వయిహతేత్రైవ
గర్జిష్యంత్యాశుదేవతాః-ఓం...।౩౮।ఓం....ఋషిరువాచ-ఓం.....
౩౯।ఓం.........ఏవముక్త్వాసముత్పత్య సాఽరూఢాతంమహాసురం-
పాదేనాక్రమ్యకంఠేచశూలేనైనమతాడయత్ - ఓం.........॥౪౦॥
ఓం.........తతస్సోఽపిపదాక్రాన్త స్తయానిజముఖాత్తతః -
అర్ధనిష్క్రాన్తఏవాసీద్దేవ్యావీర్యేణసంవృతః-ఓం.........॥౪౧॥
ఓం.........అర్ధనిష్క్రాన్తఏవాఽసౌయుధ్యమానోమహాసురః-
తయామహాసినాదేవ్యా శిరశ్ఛిత్వానిపాతితః - ఓం.........॥౪౨॥
ఓం.........తతోహాహాకృతంసర్వం దైత్యసైన్యంననాశతత్ - ప్రహ

## తాత్పర్యము.

దుగొప్పమహిషాకృతి ధరించి త్రిలోకములయందు చరాచరములను క్షోభింపజేసెను । ౩౩ । అప్పుడు జగన్మాతయయిన చండిక ప్రసన్నురాలయిన్ని ఉత్తమమైన సురాపానము పదేపదే పుచ్చుకున్నదయి నేత్రములు యెర్రనచేసి నవ్వినదాయెను । ౩౪ । ఆమహిషాసురుడును మద - బలములచే కూడుకొన్నవాడై గర్జించి కొమ్ములచేత పర్వతములను చండికాదేవిపై వేసెను । ౩౫ । ఆ దేవియును వానిచే వేయబడిన పర్వతములను బాణములచే చూర్ణముచేయుచు సురాపానమత్తతచే తొట్రుపాటున వానిని గూర్చిపలికెను । ౩౬ । దేవి పలికెను । ౩౭ । హేమూఢ - నేను సురాపానము చేయు వరకు క్షణకాలం గర్జించుము గర్జించుము - నేను యిక్కడ నిన్ను - చంపగా లోదేవతలుశీఘ్రముగా గర్జించెదరు।౩౮। ఋషిపలికెను।౩౯। యీప్రకారముపలికి మహిషాసురుని పైకియెగిరి కూర్చుండి పాదముచే కంఠము త్రొక్కిపట్టి త్రిశూలముచే పొడిచెను॥ ౪౦ ॥ అప్పుడారాక్షసుడు దేవికాలిచే త్రొక్కిపట్టబడినందున సఖముప్రాణములు పోయినవాడయిన్ని - వీర్యవంతుడయి ॥ ౪౧ ॥ మహిషాసురుడు సఖ






## మూలమ్.

షణ్ణంచపరంజగ్ముః సకలా దేవతాగణాః - ఓం......... ॥ ౮౩ ॥
ఓం.........తుష్టువుస్తాంసురా దేవీం సహదివ్యైర్మహర్షిభిః -
జగుర్గంధర్వపతయో ననృతుశ్చాప్సరోగణాః-ఓం.........॥౮౪॥
ఇతిశ్రీ.........తృతీయోఽధ్యాయ ఉవాచ ॥౩॥ శ్లోకాః ॥ ౮౦ ॥
ఏవం ॥ ౮౪ ॥ ఏవమాదితః ॥ ౨౧౭ ॥

## తాత్పర్యము.

మృతప్రాణములు పోయినవాడయ్యెను - దేవితో యుద్ధముచేయగా
నామహాదేవి ఖడ్గముచే శిరస్సును ఖండించి పడవైచెను ॥ ౮౨ ॥
పిమ్మట హాహాశబ్దముచేయుచు రాక్షససైన్యము పరిగెత్తిపోయెను
సకలదేవతా గణములు తృప్తిపొందిన సంతోషమును జెందిరి ॥ ౮౩ ॥
దేవతలు మునిశ్రేష్టసహితులయి దేవినిగూర్చిస్తోత్రముచేసిరి - గంధ
ర్వపతులు పాడిరి - అప్సరసగణములు నృత్యముచేసిరి ॥ ౮౪ ॥



ఓం.........**** - ఋషిరువాచ - ఓం......... ॥ ౧ ॥
ఓం.........శక్రాదయఃసురగణానిహతేఽతివీర్యే తస్మిన్దురాత్మని
సురారిబలేచదేవ్యా - తాంతుష్టువుః ప్రణతినమ్రశిరోధరాంసావాగ్భిః
ప్రహర్షపులకోద్గమచారుదేహాః - ఓం......... ॥ ౨ ॥ ఓం
.........దేవ్యాయయాతతమిదం జగదాత్మశక్త్యా నిశ్శేష దేవగణ
శక్తి సమూహమూర్త్యా - తామంబికా మఖిల దేవ మహర్షి
పూజ్యాంభక్త్యానతాస్మవిదధాతుశుభాని సానః ఓం.........॥ ౩ ॥
ఓం.........యస్యాఃప్రభావమతులం భగవాననంతో బ్రహ్మాహరశ్చ
నహివక్తుమలంబలంచ - సాచణ్డికాఖిల జగత్పరిపాలనాయ నాశాయ

ఋషి పలికెను ॥ ౧॥ దేవతలవిరోధియై మహావీర్యవంతుడయిన దురా
త్ముని - దేవిచంపగా - నామెనుఇంద్రుడు మొదలయిన దేవతలు
సంతోషముచే పులకాంకిత సుందర శరీరులయి వంచబడిన శిరములు
గలవారయి ప్రణామముచేసి వాక్కులతో స్తుతించిరి ॥ ౨ ॥
యేదేవి తనశక్తిచే యీ ప్రపంచము కలుగజేసెనో మరియేదేవి
గణసమూహముననను - మూర్తిరూపిణియో - సమస్త దేవ
తులచేత మహామునులచేత పూజింపబడు నాయంబికను - భక్తిచేత
నమస్కరించెదను - ఆమె మాకుశుభములను యిచ్చుగాత ॥ ౩ ॥







## మూలమ్.

నాశుభభయస్యమతింకరోతు – ఓం.........॥ ౪ ॥ ఓం.........
యా శ్రీస్స్వయం సుకృతినాం భవనే ష్వలక్ష్మీః పాపాత్మనాం కృతధి
యాం హృదయేషుబుద్ధిః – శ్రద్ధాసతాంకులజనప్రభవస్యలజ్జా తాం
త్వాంనతాః స్మపరిపాలయదేవివిశ్వం– ఓం......... ॥ ౫ ॥
ఓం.........కింవర్ణయామతవరూప మచిన్త్యమేతత్కించాతివీర్యమ
సురక్షయకారిభూరి – కించాహవేషుచరితానితవాద్భుతాని సర్వేషు
దేవ్యసురదేవగణాదికేషు – ఓం.........॥౬॥ ఓం.........హేతుః
స్సమస్తజగతాం త్రిగుణాపిదోషైర్నజ్ఞాయసే హరిహరాదిభిరప్యపా
రా– సర్వాశ్రయాఽఖిల మిదంజగదంశ భూతమవ్యాకృతా హిపర
మా ప్రకృతిస్త్వమాద్యా – ఓం.........॥౭॥ఓం.........య
స్యాః సమస్తసురతాసముదీరణేనతృప్తిం ప్రయాతిసకలేషుమఖేషుదేవి–
స్వాహాఽసివై పితృగణస్యచతృప్తిహేతు రుచ్చార్యసేత్వమతఏవజనైః
స్వధాచ– ఓం.........॥౮॥ ఓం.........యాముక్తిహేతురవిచి
న్త్యమహావ్రతాచ అభ్యస్యసేసునియతేంద్రియతత్వసారైః – మోక్షా
ర్థిభిర్మునిభిరస్తసమస్తదోషైర్విద్యాఽసి సాభగవతీపరమాహిదేవి

## తాత్పర్యము.

యేదేవియొక్క– సమానరహితమైన ప్రభావబలములనుభగవంతులయిన
విష్ణు బ్రహ్మ శివులువచించశక్తులుగారో యాచండికసమస్తజగత్తును
పరిపాలించుటకును – అశుభసంబంధభయమును నశింపచేయుటకును
బుద్ధినిస్ఫురించుగాత ॥౪॥ యేదేవి పుణ్యాత్ములయిండ్లయందుస్వయం
లక్ష్మీస్వరూపమో– పాపాత్ములయందలక్ష్మియో – శుద్ధాంతఃకర
ణుల హృదయములయందు బుద్ధిరూపిణియో– శ్రేష్టాచారముగలవార
లకు శ్రద్ధారూపిణియో మంచికులమున బుట్టినవారికి లజ్జారూపిణియో–
యాదేవీరూపమైననీకు నమస్కరించుచున్నాము– హేదేవి విశ్వమును
పాలించుము ॥౫॥ మేమునీయొక్క– యచింత్యరూపము నేవిధముగవర్ణ
చేతుము– అతివీర్యవంతులయిన రాక్షసులచంపుటకన్నను – యె
క్కువయేది– హేదేవి– సమస్తదేవదానవుల యుద్ధమందునీకన్న
యెక్కువయిన చరిత్రముగలవారెవరు ॥౬॥ త్రిగుణాత్మకురాలవయినను–
సమస్తలోకములకు హేతుభూతురాలవు – హరిహరాదులచేతకూడా
తెలుసుకొనుటకు వీలుకానిదానవు– సమస్తమునకు ఆశ్రయభూతురా
లవు– షడ్వికారరహితమైన ఆదిశక్తివినీవ ॥౭॥ హేదేవి – సమస్తయ








| మూలమ్. | తాత్పర్యము. |
|---|---|
| ఓం......... ॥ ౯ ॥ ఓం.........శబ్దాత్మికాసువిమలర్గ్యజుషాం | జ్ఞానములయందు మంత్రమాలకముగా సర్వదేవతలనుతుష్టినిచెందించే |
| నిధానముద్గీథరమ్యపదపాఠవతాంచ సామ్నాం - దేవీత్రయీ భగవతీ | స్వాహారూపిణివినీవ - సమస్తపితృగణములను తృప్తిచేయుటకుసర్వ |
| భవభావనాయ వార్తాచసర్వ జగతాంపరమార్తిహంత్రీ - ఓం | జనులచే నుచ్చరించబడు స్వధాయను మంత్రరూపిణివినీవ ॥౮॥ హేదే |
| ......... ॥ ౧౦ ॥ ఓం ......... మేధాసిదేవివిదితాఖిలశాస్త్ర | వి- ముక్తికిహేతుర్భూతురాలవు - యచింత్యమైన బ్రహ్మజ్ఞాన |
| సారా దుర్గాఽసిదుర్గభవసాగరనౌరసంగా - శ్రీః కైటభారిహృదయైక | స్వరూపిణివినీవయని యింద్రియనిగ్రహులైన జ్ఞానవంతులచే నభ్యసించ |
| కృతాధివాసా గౌరీత్వమేవశశిమౌళికృతప్రతిష్ఠా - ఓం.........॥ | బడుచున్నావు- సమస్తమోక్షార్థులైన మునులచేత ధ్యానముచేయబడు |
| ౧౧ । ఓం.........ఈషత్సహాసమమలం పరిపూర్ణ చంద్రబింబాను | విద్యాస్వరూపిణివినీవ ॥ ౯ ॥ శబ్దాత్మికవై నిర్మలమయిన ఋగ్య |
| కారికనకోత్తమ కాంతికాంతం - అత్యద్భుతం ప్రహృతమాత్తరు | జుర్వేదములకు మూలమునీవ - సంగీతరూపమయిన సామవేదమునకు |
| షాతథాపి। వక్త్రం విలోక్యసహసామహిషాసురేణ.........॥౧౨॥ | మూలమునీవ - హేదేవి - మూడువేదములును నీవ - భగవతివినీవ - |
| ఓం.........దృష్ట్వాతుదేవికుపితంభ్రుకుటీకరాళముద్యచ్ఛశాంకసదృ | సంసారమునకు హేతురాల వీవ సర్వజగత్తులయం దుత్పన్నమ |
| చ్ఛవియన్న సద్యః - ప్రాణాన్ముమోచమహిషస్తదతీవ చిత్రం కైర్జీ | యిన యాపదలను దూరముచేయు దానవునీవ ॥ ౧౦ ॥ హేదేవిబు |
| వ్యతేహి కుపితాన్తకదర్శనేన- ఓం.........॥ ౧౩॥ ఓం......... | ద్ధిస్వరూపిణివి - సమస్త శాస్త్రసారములను తెలిసినదానవు - |
| దేవిప్రసీదపరమా భవతీ భవాయసద్యో వినాశయసికోపవతీకులాని- | దుర్గారూపిణివి దుర్గమమయిన సంసారసాగరమును - యీదు |
| విజ్ఞాతమేత దధునైవయ దస్తమేతన్నీతంబలం సువిపులం మహిషా | టకునౌకాస్వరూపిణివి - అసంగురాలవు - లక్ష్మివి - కైట |
| సురస్య - ఓం......... ॥ ౧౪ ॥ ఓం.........తేసమ్మతా | భారిహృదయమున వాసముచేయుదానవు - గౌరివి శివుని |




